కూసుమతీగ్రంధమాల

ప్రథమ పుష్పము

# గర్వభంజనము



గ్రంధకర్త:

గండికోట బాబూరావు.

శ్రీ

# గర్వభంజనము.

మారుతీ గ్రంథమాల,



విజయనగరం.

గ్రంథకర్త,

## గండికోట బాబూరావు.

 [వెల 0-12-0.

# పీఠిక.

శ్రీకరుఁడగు నారాయణుఁడు శిష్టజనరక్షణార్థమును, దుష్టజనశిక్షణార్థమును దశావతారములఁ దాల్చియున్నవాఁడు. అందుల శ్రీరామావతారమును కృష్ణావతారమును జగంబునఁ జాలకాలము వఱకు నాదేవుఁడు ధరించి యనేక యమానుషకృత్యముల నాచరించియుండెను. ఈయవతారద్వయమున నాకేశవుఁడు బాల్యయౌవనకౌమారవార్థక దశల యందునఁ గావించినమహాకృత్యములు పేర్కొనఁదగినవియు నిత్యపఠనీయార్హములు నయియున్నవి.

ఈనాటకకథాంశమట్టి కృత్యములలో నొకటియగు రామకృష్ణ పరివర్తనమును తెలియఁజేయును. ఈగ్రంథమును నేను సుమారు మూఁడు వత్సరములకుఁ బూర్వము నెల్లిమర్లలో స్థాపింపఁబడిన శ్రీయానందలక్ష్మీవిలాస నాటకసమాజము వారలకై రచియించియుంటిని; తత్సమాజాధిపతులగు కీ. శే. చంద్రగిరి నరసింహులు నాయుఁడుగారు కాలధర్మము నొందుటవలనను బదఁపశి నాసంఘమంతయుఁ జెదరి చెడుటవలన నియ్యది యింతదనుకఁ బ్రకటింపఁబడకుండెను.

ఇయ్యది కాక, మద్విరచితములగు కృష్ణలీల, ప్రహ్లాదచరిత్ర, సీతాకల్యాణ నాటకనటనముల రంగస్థలములఁ బ్రదర్శించిన నామిత్రులెల్లరు వీనిఁ బ్రకటింపఁ బలుసారులు ప్రోత్సాహపఱచుటచేఁ దుదకనేకవ్యయప్రయాసముల కోర్చియిద్దానిఁ దొల్త నీగ్రంథమాలయందుఁ బ్రథమపుష్పముగఁ బ్రకటించినాఁడను. ఇటీవలఁ దక్కిన నాగ్రంథములును నితరకవి విరచిత కావ్యములును గాలక్రమమునఁ బ్రకటింపఁబడుచుండును. ఇందెట్టి దోసములుండినను బుధజనులెల్లరు మన్నింపఁ బ్రార్థితులు.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
గండికోట బాబూరావు.
గ్రంథకర్త.

విజయనగరము.
8-1-1926

# ఈ నాటకమున గల పాత్రలు:—

పురుషులు.

బలరాముఁడు.

కృష్ణుఁడు.

నారదుఁడు.

ఆంజనేయుఁడు.

గదుఁడు.

సుదాముఁడు.

అనంతుఁడు.

భటులు మొదలగువారు.

స్త్రీలు.

రుక్మిణి
సత్యభామ.
లక్షణ.
} కృష్ణుని భార్యలు.

బృంద.
అరవింద.
} పరిచారికలు.




# ప్రథమాంకము.



## ప్రథమరంగము.

### వైకుంఠము.

(విష్ణువు, లక్ష్మి, భూదేవి, గరుత్మంతుఁడు నుందురు.)

లక్ష్మి.

శా॥ శ్రీవైకుంఠపురంబు మీవలనఁబ్రా ♦ సిం గాంచుచుం సంపదల్
చేవల్ గాంతతసద్విలాసములు న ♦ క్షీణప్రభావంబులున్
లావుం జెందుచు నొప్పునట్టి భవదు ♦ ద్యానంబులుం లీలలుం
దేవల్ చూచుచు నుంట మా సుకృతమే ♦ నీరేజపత్రేక్షణా!

భూదే.— జగదభిరామా! మీపదపంకజముల నిరతంబును సేవించుచున్న మాకెల్లరకు నపరిమితానందంబు చేకూరుటయే కాక మేము సకలమనోరథసిద్ధులము గూడ నగుచుంటిమి.

లక్ష్మి.— దేవా! మీ యనుపమాన సత్ప్రభావాతిశయము చేతను, మిమ్ము భజియింప నరుదెంచు మహామునివరేణ్యుల భక్త్యు నోత్సాహంబు గలుగుచుండుటచేతను మేమెంతయు ధన్యుల మగుచుంటిమి.

భూదే.— అనుదినమును మీచరణపల్లవంబుల నమితభక్తి నెంత సేవించినను మాతనివి దీరకున్నది!

జయ— దేవా! యెవ్వరో మునీంద్రులు వచ్చుచున్నట్లున్నది.

విజ— వైకుంఠదేవా! మాకీప్రతీహార పదవులఁదీసివైచి మఱెట్టి యుద్యోగమునైనఁగటాక్షించినచోఁజాల సంతసించెదము.

విష్ణు— యేమట్లనుచుంటివి?

విజ— మఱల నేఁడుగూడ సనకసనందనాదులు వచ్చుచున్నారేమో యని భీతి గలుగుచున్నది.

విష్ణు— మీరింకనట్టి భయంబు నొందవలదు.

విజ— ఇన్నియుగంబుల వెనుక మేమిర్వురము రాక్షసులమై మహాఘోరకృత్యంబుల నాచరించి క్రమ్మర మీసన్నిధానంబున నిన్నినాళ్లకుఁజేరికొంటిమి. ఒకదివసమైన నింకనుగాలేదు, ఆయతులవలన మగుడ నట్టిగతి పట్టునోయని భయముఁగొనుచుంటిమి.

విష్ణు— బుద్ధిఁగలిగి మీరు ప్రవర్తించినచో మీకట్టి కీడింక వాటిల్లదనిమే నమ్ముఁడు.

( అంతటనారదుఁడు ప్రవేశించును. )

( జయవిజయులు ప్రక్కలకరుదెంచి నిలుతురు )

నారదుఁడు— పద్మనాభా! యిన్ని వాసరంబులకు మఱలనీ దర్శనలాభంబునాకు నలవడినది. నాసాష్టాంగ నమస్కృతులఁగొనుము.

( అనిమ్రొక్కును. )

( విష్ణువుమొదలగువారు లేచెదరు. గరుడుఁడట్లెకదలకుండును )

నార— ( లక్ష్మిపంకదిరిగి ) క్షీరవారాశితనయా! లక్ష్మీ! నీదాసునివందనంబులు గ్రహియింపుము.

విష్ణు<br>లక్ష్మి } సకలమనోరథసిద్ధిరస్తు.

గరు— (నారదునివైపుఁజూచి) నీకెంత చనవిచ్చుటఁగలిగిన ను గొంతదూరమునుండియే వారల సమస్కరింపఁగూడదా! దేవుని

మీదఁ బడినఁగాని నిన్నుభక్తుఁడని లోకములననేరవు కాఁబోలును.

నార — అదియంతయు నీకేల! నీభృత్యపదవిని నీవ్రమాంచు కొనుము.

గరు— నాయునికి భృత్యపదవియే! శ్రీమహన్నారాయణునకు నెల్లవారమును భృత్యులమే. దాని ప్రశంస నీకెందుకు? నీలోక సంచారమును, నీ కలహోద్యోగమును, నీభిక్షాటనమును నీవాలోచించుకొనుము.

నార—దేవా! యాతని కాఱుకూఁతల నాలించిచుంటివి కదా!

విష్ణు—నారదా! వానితో నీకేల?

గరు—దేవాదిదేవా! నీకు నాపయి నాగ్రహము గల్పించుటకై నారదుఁడు పన్ను పన్నుగడలఁగాంచుచుంటివి కదా! స్నేహితులను విడఁదీయుటయుఁ బరమశత్రువులుగఁజేయుటయు, నొకరిచేత నొకరి సంహారింపఁజేయుటయుఁ గొండెములు, నిచ్చకములుఁ దండోపతండములుగఁ బేర్చుటయు నీతని వ్యాపారమని నీవెఱుంగనిదికాదు. ఇట్టి యకార్యములఁ జేయనీయక యీతని నేమహారణ్యముననో, యేపర్వత గుహాంతర్భాగముననో, నోరును ముక్కును మూయించి ప్రాణమును దాల్పించి మూలఁగూరుచుండ నియమించినచో లోకము లన్యోన్య స్నేహానురాగములఁ జెలఁగి శాంతివహించి యుండునుగదా! ప్రవైరవృత్తమునకు నీతఁడే బీజము! ఏ మహాసంగ్రామ ప్రవాహమునకు నీతఁడేయుత్పత్తిస్థానము!

విష్ణు— వైనతేయా! అదినేనెఱుంగనా? ఎవ్వరెట్టిపనిఁజేయవలయునో వారే సలుప వలయునుగాని యన్యులవశమగునా? (అనినారదునిగాంచి) నారదా! యెచ్చటనుండివచ్చుచుంటివి?

నార— కైలాసమునుండివచ్చుచుంటిని.

విజ— ఓహో! యీతఁడు నారదుఁడుగదా!

జయు— చాలకాలమయ్యెచూచి యున్నందున నీమహాత్ముని

గుర్తింపలేకుంటిమి!

నార— శ్రీధరా! నీతోలాలగంబున నీకన్న గొప్పవారలు గూడనున్నారని నేను నేఁడు తెలిసికొనఁగల్గితిని. ( అనిగరుడునిజూపఁ జూచును)

లక్ష్మి— అదియేటిమాట?

విష్ణు— వత్సా! నారదా! ఏల యిట్టి విపరీతవాక్యముల నాడఁ గడఁగుచుంటివి! నీవు పల్కినతీతివట్టి వారెవ్వరునిచ్చట లేరే!

ఉ ఎన్నఁడులేని యీనుడుల ♦ నిచ్చట నేర్చితి విట్లులాడఁగా
నన్నగ తాళిఁ జేయుటకు ♦ నా? యహా! తాత యటంచు నెంచి, నీ
తెన్నులి దేమిమాటనిఁక ♦ వచ్చితివాక్యవిశేషమద్ది తూ
పన్నగవైరి నావిధము ♦ పట్టి కనుంగొన దేలనారదా?

నార— లోకేశ్వరా! చతుర్దశ భువనంబులను గుక్షినిఁగల నీవంటి మహామహునికి మనుమఁడననియు, సకలభువన నిర్మాత యగు ధాతకు మానసపుత్రుండననియు, నించుకయును దలంపక మనోగర్వంబును గలిగిన కాపురుషుఁడొకఁడు నీయాస్థానంబునఁ గలఁడని నేమున్నెఱుఁగనయితిని!

విష్ణు— అవునవును.

నార— దేవా? అహోగరు నాయంతటనేనే యెంచెదఁ గాక, నాకింక సెలవిమ్ము.

విష్ణు— ఏమి! యింత తత్తరపాటొందుచుంటివి!

నార— లక్ష్మీనారాయణులారా! నాకిఁక నైన సెలవొసంగుఁడు మరలమీదర్శనంబులఁ జేసికొనియెదను.

విష్ణు— సరియే, పొనుము.

నార— ( వెనుకకుఁ దిరిగి చూచుచు వెడలును )

లక్ష్మి— దేవా! వీని చిన్నతనపుఁజేష్టలెప్పటికి నుడిగినవికావు.

విష్ణు— జయవిజయులారా! వానిని మీరేమయినఁ జేసితి రా యేమి?

జయ } ( లెంపలువాయించుకొని ) దేవేశ్వరా! యిదివరలో
విజ } సనకసనందనాది మహామునివరేణ్యులపొడఁదప్పుఁ గావించి యెంతయు ననుభవించియే యుంటిమి. మేమింక నిట్టిరీతిగ వర్తింపమని యేవిశ్వసింపుము.

గరు— ( లేచి నిల్వఁబడి ) జగద్రక్షకా! అతఁడునాపైఁ గన్నులెఱ్ఱఁజేసి చనియెను.

విష్ణు— అట్లేల చేయవలయును?

గరు—ఏమోనేనెఱుఁగను. నేనాడిన మాటలయందేమైనఁ దప్పు గలదా?

లక్ష్మి—దేవా! మనమెల్లరమూ నారదు నాదరించుచుండ నీతఁడించుకయువాని సరకుసేయక యేమేమో యనెనని వీనిపైఁ గన్నులగ్గలఁజేసి వెడలెను.

గరు— అదియాకారణము!

విష్ణు— మనమందారారామంబున కరిగి వానిజాడను గనుఁ గొందమురమ్ము.

( అని నిష్క్రమించును )

[ తెర దిగును. ]

## ద్వితీయరంగము.

వైకుంఠపుర రాజమార్గము.

నారదుఁడు ప్రవేశించును.

సకలలోకేశ్వరుఁడును, నాకుఁబితామహుండును, నగుశ్రీమన్నారాయణుఁడుసైతము నేనేగుతరి ననేకరీతుల ననుసన్మానింపఁగా నా భార్యుంతుమాత్రిస్త్రుఁ నన్నించుక యు. నించుక సరకుసేయకుండుటకు

నాకెంతయు నాశ్చర్యముగఁ దోఁచుచున్నది.

శా. ఏలోకంబున కేగినన్ సరియైన ♦ న్వీక్షింప నెవ్వారలున్
జాలన్ భక్తి నిసత్కరించి, వినుతుల్ ♦ సల్పంగ, వైకుంఠుఁడే
లీలన్ మెచ్చఁగ నేల యీజడుఁడుదా ♦ లేశంబు లెక్కింపకే
నేలన్ బడ్డ ఖగంబుమాడ్కిఁ గదలన్ ♦ లేకుండె గర్వాంధుఁడై?

వారిజసంభవమానస పుత్త్రుండనైన నన్నే యీతఁడు దిరస్కరింపఁ దక్కిన మునికులకుంజరులఁ గన్నెత్తియైనఁ జూడనొల్లఁడనుట నిశ్చయమే. సత్యమాధవపద సేవానిరతుండని యీ, నగపమానపక్షఘోరబలుఁడనియుఁ దనలో నెంచుకొనుచు నిరర్థకాతిశయమును బెంచుకొనుచు నిట్టులీగుచున్న యీపినతాతనూజుండు నాతో నేయంశంబునన యినసాటిగానేర్చునా? వాఁడెంతకుటిలుఁడు! కుటిలుండని మెల్లగా ననుచుంటి నేల? విషకోశములనోటఁ గల భుజంగరాజముల నంతతము భక్షించు నాచెనఁటికి నిలువెల్ల విషముండుట యబ్బురమా? మాలిసుమాలి మాల్యవంతాది మహాదానవవీరవరుల గదాదండంబుల నెన్నిసారులో దండింపఁబడియుండియు నిప్పటికిని నిజమద విశేషంబును వినియోగింపఁబూనుట యెందులకో నాకుఁ దెలియకున్నది. వాణీవాహనంబగు మయూరము భుజంగభక్షణా నిరతిఁ గలిగినదయ్యుఁ గదు సాధుగుణములఁ జెలఁగుచుంట యెంత యుత్సాహకరమయియున్నది! పక్షిరాజనియెడు బిరుదము నీతులువకు పంగుట మిగుల నక్రమము. రూపమా వక్రము, బలమునకా నేలఁగాలుంచనేరఁడు. అయిన వీనినవనవలసిన పని యేమున్నది? కాలమహిమ యింతయైనఁ గావించును. తెక్కుబలమున్నవాని రాజ్యమనియెడు నార్యోక్తి ననుసరించి యీతఁడీ విధముగా గర్వోపద్రిమత్తుఁడై యీ తెక్కుబలమే యుక్కుబలమని లెక్కించి ప్రమగ్రిక్కుచున్నవాఁడు అయిన వీని నీయంశంబున పిడిచిపుత్తునా? వలదు వలదు. వీనికిఁ దగిన యహంకారభంగముఁ గావించి మత్ప్రభావంబు చేనాకున, సాలోకసామీప్యంబునకున్ దాసానుదాసునిగఁ జేయుదము గ్నైన కలహప్రియుండగు నాగుణమిట్టిదెట్టుకో యున్నకావి

యుండునా? లేదు, కాదు. కేవలదుర్మదముచే నీభంగిఁబ్రవర్తించెనని నమ్మెద. ఇందులకేమి కర్తవ్యముగలదు? (అని ఆలోచించి) గోవిందునితో నీసుద్దిఁ జెప్పి యీచెనఁటికి బుద్ధివచ్చునట్లొనర్చునగు నా? అచ్చట వలను పడనేరదు. త్రిపురాంతకుని కడకరిగినచోఁ గూడలాభము గన్పట్టదు. విరించి యేమయినఁ జేయఁగలఁడా? అదియు నిరాశయే యగును. మఱచితిని. ద్వారక యున్నదనుమాట యిప్పుడునాకుజ్ఞప్తికివచ్చినది. సరియే. బాగు. శ్రీకృష్ణరూపమున నవతరించిన విష్ణుండును, మదభీష్టసిద్ధిఁ గావింప నెంచుపురుషసింహాం డునచ్చట నలరుచుండెనుగదా! ఇఁక నాకేమి? ఇట్టిఖగాధములఁ గోటినేనిఁ బరిగణింపని కాళీయ మహాఫణిశిఖరములమట్టి మీఱిన కెట్టికడ నుట్టిపడుదునుగాక.

(అని నిష్క్రమించును.)



## తృతీయరంగము.

[ఉద్యానవనము. శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్యభామా లక్షణలతోఁ బ్రవేశించును.]

కృష్ణు— కాంతామణులారా! ఇంతమాత్రముననే మీముఖారవిందములఁ జిరుచెమ్మటలు గలిగినందులకు నాకుఁగడు నక్కజమగుచున్నది! చంద్రకాంతశిలావేదికలపై మౌక్తికంబులమ్రుగ్గులిడిన భంగి మీయనుపమానసౌందర్యంబులకు నీఘర్మజలబిందుసందోహంబులతిమనోహరములుగనే యొప్పుచున్నవి!

సత్య— జగన్మోహనాకారా! సమస్తచిత్రంబుల నెఱిఁగిన జాణవగునీవుమమ్ములనీమాడ్కిఁ ద్రిప్పుచున్నయెడ నీకీఘర్మసలిలకణంబులిట్లుతోఁచుటయొక చిత్రమెంత మాత్రమును గానేరదు.

కృష్ణు— సెబాసు. స్వయంప్రకాశమణియంతటి విలువగల

మాటనాడితివి! అందులకు నేను జాలమెచ్చితిని. కానసీపుష్పరాజంబు ను నాచే బహుమానముగాగ్రహింపుము.

రుక్మి—ఈపరిమాణమా పెళొక లెక్కయా?

కృష్ణు— ఏల యట్లనుచుంటివి?

రుక్మి-ఇయ్యది పారిజాతమునకంటె విశేషముగలదనియాయని

కృష్ణు— ఓహో! బహుబాగుగాఁ దెల్పితివి. నీవీ కుసుమమునుగొనుము.

( అనిమతియొకపుష్పము నిచ్చును. )

సత్య— అదిదాని కేల?

కృష్ణు— ఎందులకువలదు?

సత్య— అదిసువర్ణచ్ఛాయను మించి యుండ లేదని.

కృష్ణు—ఏమి? యిదిచంపక సుమముసకంటె వేయింతలు శ్రేష్ఠతరముగాదా?

సత్య— నాయుద్దేశమయ్యదికాదు.

కృష్ణు— మరియేమి?

సత్య— నాఁడు తనవివాహమునకుఁ బూర్వము నీకడకాపె యంపిన బ్రాహ్మణుని శరీరచ్ఛాయను మించినదా యని నాయర్థము.

కృష్ణు— ఎవ్వరి యర్థమెట్లయిన నేమి? మనమిచ్చటకువచ్చినది వినోదార్థముగాదా? సింగఁపుగున్నలనడుములఁ బరిహసించునో సింహతనుమధ్యలారా! యీతరుణంబునసీ యారామంబున కొకపురుషసింహమువచ్చి మిమ్ముఁబట్టబూనినచో మీరేమిచేసెదరు?

రుక్మి— ఎచ్చటనయిన దాగుకొందుము.

కృష్ణు—ఏభయముచేత నట్లు చేయఁదొడఁగెదరు?

లక్ష—అది కొకకంధరంబులఁ గొట్టికి వేయదా?

సత్య—కంధరముల నంటసేరదు కాని యధరంబులఁ గొత్తికి వేయునని డగులొందెదము.

లక్ష—ఎచ్చటనైన నఁబెదవులఁ గొఱుకుఁ గఁఠీరవము జగంబునఁగలదా?

సత్య—లేకేమి? అట్టి పురుషసింహమియ్యది కాదా?

రుక్మి—సర్వజ్ఞుండగు నీమానినీమనోహరుని నొకకూర్రమృగమని యెట్లు భావించితివో నాకుఁజిత్రంబుగఁ దోఁచుచున్నదే?

సత్య—నీవెఱుఁగవు కాఁబోలును ఈతఁడు మున్ను కువలయాపీడమనియెడు గజమును గూల్చిన పురుషసింహుఁడు కాఁడా?

రుక్మి—అవునవును.

సత్య—తత్కుంభవిదారణక్రియను గూడ నంతటి మహానుభావుఁడే!

కృష్ణ—ఓహో! యేమి! మీ ప్రియాలాపంబులకు మితిలేకున్నయది! ఈపల్కులకేమి? (అని యిటునటుఁజూచి) సఖియలారా! యిచ్చట నిదివఱకుఁ గల శశికాంతశిల యేమయినది?

లక్ష—ప్రాణేశ్వరా! నీవు క్షణము క్రిందట నిత్తావున వేణుగానమొనర్చుతరి నయ్యది సంపూర్ణంబుగ గరఁగి ద్రవరూపంబునఁ బ్రవహించిపోయియుండలేదా?

సత్య—అవును. అమాట నిజమే. ఆతరుణంబున నీవేణునాదము గూడఁ జగురిడినది కాదా?

కృష్ణ—ఏదీ! (అని వేణునుదీసి) ఎచ్చటను గన్పడదే!

రుక్మి—అవును. ఆ పల్లవమింతలో నేరీతి మాయమయినది?

సత్య—ఏమో! కోకిలవాణులరగు మీాదరి నెట్టిపల్లవులయిన నిల్వనేర్తురా?

కృష్ణ—సెబాసు! మీావంటి కలవుఁదీర్పు కాంతామణు

యుండినచోఁ గాలంబుగడుఁ గమనీయముగఁ గడచునుగదా!

రుక్మి—కాంతలకుఁ దగిన కాంతులు గలిగినచో సంతతము సంతసము సమకూడునుగదా!

లక్ష్మ—మా యెల్లర నీరీతి రంజిలఁజేయుటయే మాకు మహాభాగ్యము! నీతో సమానంబుగ మాకొసంగఁబడుచున్న స్వేచ్ఛకీ జగంబునభామలు సుందరాంగులు సాటి రాఁజాలరని సంతసించుచుంటిమి.

కృష్ణ—అట్లే యుండరవలయును. వినుడు.

ఉ॥ ముత్తియముల్ గదా తలఁప ♦ ముద్దులగుమ్మలు వారి నిత్యముం
జిత్తమునందుఁ జేర్చి కడుఁ ♦ జెన్నుగ హారమురీతి నెంచుచుం
జొత్తున స్వేచ్ఛగా విడిన ♦ మోదము చేకుఱు బిగ్గఁగట్టినం
గుత్తుకఁబట్టి చేటుగలు ♦ గుందొలఁగుం దుది యెట్టివానికిన్॥

లక్ష్మ—సలక్షణులకుఁ గదా యిట్టి సంగతులు గోచరములగును.

సత్య—చాలును. మాట నాడినచో నీపేరే తలఁచుకొని యెదవు.

కృష్ణ—దానిపల్కు సత్యమే! ఇప్పుడు నీపేరు నేను దలఁచితిని గదా!

సత్య—(చిఱునగవుతో) పరియే:

కృష్ణ—సఖియలారా! యింక మనమీవనాంతర్భాగంబున కరిగి యందందుఁగల మహాచిత్రంబులఁ గాంచుదము రండు.

(అని వారలందరతో వెడలును.)

తెరపడును.



చతుర్థరంగము.

శ్రీకృష్ణుని మందిరము.

రుక్మిణీ కృష్ణులుందురు.

రుక్మి—మనోహరా! మనము గడియ క్రిందట సుద్యానవనవాటికను జాలవఱకు విహరించి యుంటిమి. అందువలన మీసుకుమార సుందరశరీర మినుమంత యలసి యున్నట్లు నాకుఁ దోఁచుచున్నది!

కృ—సతీమణి! పురుషుండనగు నాయొడలే యలసియున్నట్లు నీకుఁ గాన్పడుచున్నచోఁ గుసుమకోమలాంగివగు నీ మృదుతనూలత యెంతదనుక డస్సి యున్నట్లు నాకుఁ గన్పట్టునో యెఱుఁగవా?

రుక్మి—నాథా! ప్రాణేశ్వరుఁడు దరినున్నచోఁ గాంతలకెట్టి యాయాసమును గలుగనేరదనియెడు సంగతి మీకెఱుంగరా? ఆరీతి నింతవఱకు మాయెల్లరకట్టెదుట నిల్చి మాయుల్లంబులుల్లాసంబునఁ దేలునటులు సల్లాపంబుల నాడియాడి యెల్లవిధంబుల రంజిల్లఁజేసిన మీమంజులరూపంబు చేరువనున్న మాకు నలయిక యెకటియా?

కృ—ప్రాణనాయకీ! నీకు మనంబునఁగల్గు ప్రేమాతిరేకంబుచే నట్లనుచుంటివి కాని యది యథార్థమగునా?

రుక్మి—మనోహరా! దానిమాట కేమి? ఈ సుగంధద్రవ్యంబుల నించుక మీశరీరంబునఁ దాల్చితిరేని దంతయు నేఁటఁబోవును. దీనఁ గడు మనోల్లాసంబు చేకూఱును. నామనవిఁ జెల్లింపుఁడు.

చ॥ జలకములాడు పిమ్మట హ ♦ జారము పీడిన పిమ్మటన్ వనిన్
మెలఁగిన పిమ్మటన్ గరము ♦ మేను శ్రమొందిన పిమ్మటన్ సుగం
ధలలితపుష్పవాసనలఁ ♦ దావులనీను రసంబులన్ గడున్
జెలఁగుట మేలుకాదె? నవ ♦ చిత్తజరూప! రహిన్ గ్రహింపరే?

కృ—అక్కో! కైకొందును గాని యింతలోనే నేనుడస్సితినని భావించుచుంటివా? ఈనాఁటి వనవిహారము నాకొక లెక్కయా? తొల్లి నీవయసునకుఁ జాలఁ జిన్నతనంబునని పేర్వెల్లెను గల నంద గోకులమందును, గాళిందీతీరములందును బృందావనమునందును నహోరాత్రములు సైతము పరిగణింపక చరియించిన యట్టి నాకిది యొక్క భారమని యెంచితివో నాకక్కజమగుచున్నది! మన వనంబునఁ గల వింతల సంతసంబునఁ గాంచుచు నించుక దవ్వు మాత్రము సంచరించినాఁడులకే నన్గూర్చి నీవెంతగాఁ గనికరించుచుంటివి!

సీ॥ గోపకాంతలతోడఁ ♦ గూడి మురిగ విహరించి
యెలమితోఁ బొన్నచె ♦ ట్టెక్కునాఁడు
నలమహేంద్రునితోడఁ ♦ గలహించిగోవర్ధ
ననగంబుఁగొడుగుగఁ ♦ దాల్చునాఁడు
మడుఁగులోఁ గాళీయు ♦ మస్తకావళియందు
నల్లనఁ దాండవ ♦ మాడునాఁడుఁ
జెక్కుచోట్లఁజెలఁగి ♦ వెన్నముద్దలు మ్రింగి
యుట్టిపైనుయ్యెల ♦ లూగునాఁడు
గీ॥ ప్రాణనాయకి! నీవె న ♦ న్నరసినయెడఁ
గుంది డస్సితినని దిగు ♦ లొంది పుష్ప
చందనాకులఁగప్పి గొ ♦ జ్జంగనీట
ముంచి యొత్తియుండెదవేమొ! ముద్దుగుమ్మ!॥

రుక్మి—ప్రాణనాథా! అప్పటిమాటకేమి? నేఁడుస్వీకరింపుఁడు.

కృ—చెలియా! నీవు మఱియొకరీతిగ భావింపకుము. ఇప్పు డొక కార్యార్థము నాయన్నగారిఁ జూడ నరుగఁ దలఁచుచుంటిని. ఆతఁడీక్షణంబున సభాస్థానంబున నున్నయటులు తెలియవచ్చినది. కాన.

చ॥ సవనముఁ జేయువేళ మఱి ♦ సంగరభూమిని జొచ్చువేళ భూ
ధవులను గాంచువేళ వివి ♦ ధప్రభురాజితమైన సత్సభా
భవనముఁ జేరువేళ గుణ ♦ వంతులుముట్టఁగరాదు వాసన
ద్రవములు నెందు నేని మది ♦ తా! యది తప్పగుఁ గ్రానమానుమా!॥

రుక్మి—దేవా! యీసంగతి నిదివఱకే మీవలనఁ దెలిసికొని యుంటిని. కాని మీరీసమయంబుననే యీసభాతలంబునకేగవలయునా?

కృ—తప్పక యేగవలయుననియే యెంచుచుంటిని.

రుక్మి—ఏమో! మీపల్కులు నాకు సందేహమును గూర్చుచున్నవి. సాత్రాజితినిగాంచఁ బోవుచున్నట్లు నాకుఁ గన్పట్టుచున్నది! అగునవును. అచ్చటికీగతి నరిగినచో నీపరిమళవ్యాప్తికి నాపె మిమ్మేమనునో యనునని కాఁబోలు నిచులకిట్లు వెనుకఁదీయుచున్నట్లున్నది!

కృ—లేదు. లేదు. నీవెన్నఁడాభంగి నెంచకుము, ఆమె వద్ద నాకేమి భయము గలదు? ఇంతకు నసృతములాడ నాకేమి యవసరము.

రుక్మి—ఊరకిట్లు పల్కితిని. క్షమింపుఁడు. మీరు మగుడ వచ్చుసరికిఁ బన్నీరుమొదలగునవి స్నానమునకై సిద్ధముగనుంచెదను.

కృ—సరియే. అట్లే యొనర్చుచుండుము. క్షణములోఁ గ్రిమ్మర వచ్చెదను.

రుక్మి—అట్లయిన నాకు సెలవొసంగుఁడు.

(రుక్మిణి వెడలును.)

కృ—మంచిది. నేను ప్రాతఃకాలమునుండియు మారామునిఁ గలిసికొన యత్నించుచుండియు నిదివఱకు నయ్యది పొసఁగదయ్యెను! అక్రూరుఁడయిననింకను రాఁడయ్యె! అతఁడు బహిర్మందిరమున కింతకు మున్నె యేతెంచియుండవచ్చును. అచ్చటికే యరిగెదఁ గాక.

(అని నిష్క్రమించును.)

పంచమరంగము:- బలరాముని దర్బారు.

బలరాముఁడు, గదుఁడు సుధాముఁడు మొదలగువారుందురు.

బల—అమాత్యశేఖరులారా! యీద్వారకానగరంబున, నా యప్రతిమానపటిమయు, మనమహాయదుసైన్యచయసంపాదిత నిర్మలయశోచంద్రికలును, నిన్నినాళులనుండియు, దినదినంబునకును నెక్కుడుభంగుల వృద్ధిఁ జెందుచున్నవనుటకు సందేహమించుకయు లేదు. సకలశత్రురాజులవలీలగ మనచే జయింపఁబడి మనకనేకవిధముల నమ్రులై యుండుట గూడ మీ రెఱుఁగుదురు కదా!

గదు—ఆహా! యట్లలరుట యొక యబ్బురమా? నానావిపక్షధ్వజినీ వర్గంబుల రూపులమాపి, క్రూరులఁగూల్చి, శరణాగతులఁగరుణించి సర్వజగద్విఖ్యాతంబుగ న్యాయపరిపాలనమొనర్చు మీకును మీసోదరులగు శ్రీకృష్ణునికి నసాధ్యమెయ్యది గలదు?

సుధా—అంతియ కాక, శిష్టజనభరితంబును, మునిగణహితంబును నగు మనద్వారవతీ పురరాజంబునకిట్టి భూవరేణ్యులు సిద్ధించుట యొక వింత కాదు.

బల—మంత్రివర్యులారా! మీ రెన్నిసారులు నన్నుఁగూర్చి యెంచెదరో యంతకు వేయిరెట్లు కృష్ణునిఁగూడ నాతో సరిఁగాఁ బరిగణించుచున్నందులకుఁ గారణంబెద్దియు నాకుఁ గానరాకున్నది.

సుదా—దేవా! అందులకుఁ గతమిదియని యెఱుఁగఁ దెల్పవలయునా? నిఖిలవైరిధ్వంసియుఁ బరమపవిత్రవిమల చారిత్రుఁడును నగు నా రుక్మిణీశ్వశత్రు నెంత నుతించినను మాకించుకయుఁ దనివి దీరకుండును,

బల — ఏమీ!

మ|| పరమార్థంబిసుమంత నెంచక, యెగో ♦ ప్పల్ పల్కుచుఁ జాలన
స్థిరుఁడై జారగుణాఢ్యుఁడై ఖలుఁడునై, ♦ చేటొందఁ బల్ ఘోరుఁడై
దురితుండై, మలినాత్ముఁడై, కుజనుఁడై ♦ తోఁచుఁ గదా! నాకుసో
దరుఁడైనన్ బనియేమి? వానిఁ దలఁపన్ ♦ దప్పౌ వికర్ణా! నమ్ముఁడీ!||

సుశా — సోదరునిపై నిట్టికఠినోక్తులాడుటకు మీమానసం
బెట్టులొప్పినదో మాకుఁగడు వింతగఁగనఁబడుచున్నది!

గదు — స్వామీ! యిన్నిదివసములనుండియు వానిపై నమిత
ప్రేమను జిలుకుచున్న మీరేల యీ యుహాంబున నింతకినుకఁగొను
చుంటిరి?

బల — అదీ మీరెఱుఁగని విశేషముకాదే! యేయంశంబునఁ
గూర్చియైన నాదుర్జనుఁడు నాకు వ్యతిరేకంబుగనే సంచరించుచున్న
వాఁడు. వీనిఁగూర్చి పెక్కువత్సరంబుల నుండియు నేనెంతయో మా
నంబున ఘనంబగు ఖేదము నొందుచునే యుంటిని. అతుంటరి లెక్కలే
క్క వయిగు నకార్యములాచరించుటచే నామానస మీరీతిమారినది.

గదు — ఆతఁడొనర్చిన యకార్యమేయ్యది?

బల — అయ్యది యని వేరుగఁ జెప్పవలయునా?

సీ. సతిమాటఁజెల్లింప ♦ శక్రునితోఁబోరి
పారిజాతము నింటఁ ♦ బాతినాఁడు
మంచిముత్యమువంటి ♦ మించుబోడిసుభద్ర
గతిలేని నరుమెడఁ ♦ గట్టినాఁడు
కౌరవేంద్రునిఁ దల్ప ♦ కయెధర్మసుతునిచే
నెలమి యాగమును జే ♦ యించినాఁడు
మఱిదియా శిశుపాల ♦ మతిమంతు నహా! నిండు
సభలోన వంచించి చంపినాఁడు

గీ॥ పెద్దవారిమాటలఁ జెవిఁ ♦ బెట్టఁబోఁడు
కౌరవుల క్షేమమిసుమంత ♦ గాంచఁడెందు
ప్రోలుమాలుచుఁ బంచల ♦ పాలుసేరు
పాండుసుతులన్నఁ బడిచచ్చు ♦ వాఁడు ఘనుఁడె?

గదు — మీపల్కులు చాలవఱకు యథార్థములే. అతఁడీ యం
శంబుల నెల్ల మనకు మేలులే నల్పెననుట నిక్కువము.

బల—సుదామా! నీ వేమని యెదవు

సుదా—దేవా! చిన్ననాఁటనుండియు మనకృష్ణుఁడొనర్చిన లీలల మనమెఱుఁగమా? మనవారిని మనమే నిందించుట యొప్పగు నా యని యించుక శంకించుచుంటిని.

బల—దురాత్ములగువారు పరులయిననేమి మనవారలయిననేమి? అట్టివారెల్లరు దండనార్హులనియే నమ్ముదు.

గదు—అట్లయిన వానికేదయిన శిక్ష యొనర్చెదరా యేమి?

బల—తనకు జ్యేష్ఠుండనగు నా యద్వితీయప్రభావమించుకయుఁ దెలిసికొననేరక నన్నావంతయు నెంచకయే మదనుపమానతీవ్రహలాయుధనిశిత ధారాప్రచండరుచులఁ దలంపకయె విఱ్ఱవీగుచు పూజ్యులగు మజ్జననీ జనకులయిన దేవకీవసుదేవుల గర్భంబులఁ జఱువ నుద్భవించిన యాకృష్ణుఁడు నునమహాసభాస్థానగంభీరవారాశికల్లోలముల నొక్క బుద్బుదమాత్రుఁడయినఁ గానేరఁడనియే విశ్వసింపుఁడు. ఆ మాయాగుణుని నా బారవోరమానను నిట్టుపై నిసుమంతయు సరకుసేయఁజాల.

సుదా—మీవంటి పరాక్రమశాలురకును,సర్వజ్ఞులకును నింతకోపంబు దగునా?

గదు—దేవా! యించుక శాంతింపుఁడు.

బల—ఈ యంశమున శాంతిపై రవంతయు బ్రాంతిఁ జెందకుఁడు. (అని కోపముతో) వాని పాపముఖంబు నీ బలరాముఁడిటీవలఁ గాంచఁ దలఁపఁడనియే యెంచుఁడు.

ఉ॥ సారెకు వేయి దుష్క్రియల ♦ నల్పుఁగ నెంచుచుఁ బెద్దవారలన్
మీఱుచుఁ గేరుచున్ ఁ బరమ ♦ నీచుని భంగిని సంచరించు నా
క్రూరమతానుకూలు నల ♦ కూళనుగృష్ణుని నీసభాస్థలిన్
జేరఁగనీయరాదు వడిఁ ♦ జెప్పుఁడు వానికి నీ యుదంతమున్॥

ఈ నాయుత్తరువు నతిక్రమించినచో నెంతయు విషమించునని కూడ

వానితో నొక్క వక్కాణింపుఁడు ఇఁక వెళ్లెదము (అని తొందరగా సభలోనుండి వెడలును.)

(అందరు నిష్క్రమింతురు.)

షష్ఠరంగము కృష్ణుని భవనము.

కృ—(ప్రవేశించి) ఆహా! యేమి యీచిత్రము! అక్రూరుఁ డీ తరుణంబునకు నాకడకు వచ్చెదనని తెల్పియు రాకుండుటకు హేతువేమి? మద్భక్తాగ్రగణ్యుఁడగు నానుగుణాన కెట్టి యాటంకము గల్గెనో నేతెంచ కుండునా? (అనియించుక సేపుండి) యీ దివసంబున సర్వావనీ త్యవర మహీమండల నాథపరివేష్టితమగు సభ సాగింపఁ బడునని యాకర్ణించితిఁగదా! అద్యాది యే సమయమునుండి యారంభింపఁబడునో కూడఁ దెలిసికొనఁ జాలనైతిని. ఏమో! అక్రూరుఁడు రాకపోవుటనరియే కదా నిత్యాచారానుసరణిని నన్నా యోలగంబునకు రమ్మని పిలుచుటకితరులేరైనను గూడరాకుండిరి! అయినను దత్తర మేల? ఏదియెట్లైయున నక్రూరుఁడు మాత్రముదప్పక వచ్చునని, యే సమ్మెదను (దూరముగాఁజూచి) అదిగో! యెవ్వరో యిచ్చటకే వచ్చుచున్నట్లున్నది! అతఁడే యయి యుండనగును.

గదు—(ప్రవేశించును) అహాహా! (తనలో) తుదకిచ్చటకు వచ్చితిని గాని యీతనికా విశేషమెక్రియఁ దెల్పనగును? అనమానప్రభాయుతుండగు నా హలాయుధధారుని యనుమతి నతిక్రమించుట దుస్సహముగదా!

కృ— (అటులిటులు చూచి దగ్గరకు వచ్చి) ఓహో! గదు నివలెనున్నది! రమ్ము.

గదు—వచ్చియే యుంటినిగదా!

కృ—ఈ యాసనంబునఁ గూర్చుండుము.

గదు— కృష్ణా! యెల్లపుడు నీచెంతఁ నీడవలె నిశ్చింతనుండు నా యక్రూరుఁడేల యిచ్చటఁ గాన్పడఁడయ్యె?

కృ— వానికొఱకే నేనింతవఱకు నీభవనమున నీమాడ్కి వేచికొనియుంటిని.

గదు— అట్లయినచో నెచ్చటికైనఁ జననుద్యుక్తుండవ ఐతివా?

కృ— అవును. ఈదినంబున నానాభూనాధాగ్రేసరులును సకలమంత్రిపుంగవులును మనసభకరుఁదెంతురని తెలియవచ్చినది.

గదు— ఇచ్చట నీవొంటరిగనే యుంటివే! ఆయా నరాధీశులును, సచివులు నింకను రారేల?

కృ— వారిత్తాపున కేల యేతెంతురు?

గదు— మఱెచ్చటకుఁజత్తురు?

కృ— రాముని సభాస్థానంబునకేతెంతురు.

గదు— నిన్నచ్చటకుఁ బిలిచికొనిపోవ నెవ్వరైన వచ్చియుండిరా?

కృ— అందులకే కదా నీవే తెంచియుందువు.

గదు— అందులకెంతమాత్రమును గాదు. నీకుఁ గేవల ప్రతికూలమగునట్టియు నించుక విషాదకరమగునట్టియు,బలరామచండతరశాసనవచోసరణి నీకుఁ జెప్పుటకిత్తెఱఁగునఁ దత్తరపాటునఁ బుత్తెంచితిని.

కృ— ఏమీ! నాయుద్దేశంబునకు విరుద్ధమగు సంగతినా తెల్పెదవు! ఏదీ చూతము.

గదు— స్వామీ! యింతవఱకు రాముఁడు నిన్నుగూర్చి యేయే వివిధాహితవచనంబులనాడి నీవొనర్చిన మహాకార్యములనెల్ల జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు నెందులకో మండిపడి పరుషభీషణభాషణంబుల నుచ్చరించి నిన్నుకొల్వుకూటంబునకు రానీయవలదనియుఁ దదాజ్ఞఁగల సందేశము నావలన నీకీరీతిగ నంపె. తెల్పఁజాలక - తెల్పఁజాలక వెనుఁదీసియు దుదకు నీకిట్లు చెప్పితిని.

కృ— ఏమి యీవిపరీతము! ఇదియంతయు నిజమా! లేక

యనృతమా?

గదు— నీకడ ననృతమాడ నాకేట్లాడును?

కృ— సోదరుఁడయ్యు రాముఁడేల నాపయి నింత కినుక వహించెనో తెలియకున్నది!

గదు— క్రూరకంస మహోదానవాద్యనేక దైత్యబృందములఁ జెండుపఱచి సర్వయాదవ జనానీకములకు విందొనఁగూర్చిన పుణ్యమూర్తి వగు నీయందుననే యా రాముఁడమంద కుపిత కందళితహృదయుఁడయినందులకు మాకెల్లరకుఁజాల విచారకరముగనున్నది!

ఉ. గుప్పున గుప్పెసఁగ్ జడలు ♦ గ్రుమ్మిన వక్రిసమీరునాదిఁగాఁ
గుప్పలుగాఁగ రాక్షసులఁ ♦ గూళలఁగ్రూరుల మున్ను గూల్చియా
చొప్పున వీఁగ కెంతయు న ♦ సుంధర క్షేమముఁగూర్చినట్టి ని
న్నిప్పుడు లెక్కసేయఁడో! ♦ యెప్పుడిఁకిన్ మదిఁ దాఁ దలంచెనో॥

సర్వదనుజవీరవ్రాత పరివేష్టితాహీనఘోర మహాటవీరంగస్థలదవాగ్నుండవై, నిఖిలగోగోపగోపికాపురరక్షణుండవైన భవత్కృతోపకారచయ మహాఘనంబులఁబడసి యిప్పటికీ ద్వారకాపురవరమున నిర్భయంగ భద్రంబుగ నిద్రించుచున్న కతన నీతనికింత గర్వాతిరేకముచేకూఱినది.

కృ— పాపమాతఁడెంత బేల? సర్వమెఱిఁగియు నప్పుడప్పుడీ మాడ్కి సంచరించుట యాతనికి సహజమే కదా! కానిమ్ము (అని గదుని వంకఁదిరిగి) గదుఁడా! నాకు జ్యేష్ఠుఁడగు వానిమాట జవదాటననియు మనమున సిగ్గొందితిననియు వానితోఁ దెలుపుము.)

(అనినిష్క్రమించును.)

గదు— తుదకెంతయయినది? బలరామకృష్ణులకిర్వురకీభాతి నన్యోన్యకలహామిఁక దప్పక సిద్ధించును. ఈకృష్ణుఁడసాధారణప్రజ్ఞావంతుఁడు. అయినను సోదరునియెడఁదొందరపడి యాతనికి ముప్పు గలిగింపనెంచునా? ఏమో! యెవ్వరెఱుఁగుదురు. కానున్నది కాక మానదు కదా!

(అనినిష్క్రమించును.)




## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

సత్యభామా శయ్యాగారము.

సత్య— నెచ్చెలులారా! యీనాఁటి శయ్యాగృహాలంకార మెంత చిత్రముగ నున్నదో వరికించితిరా?

అర— దేవీ! జగన్మోహనాకారుఁడగు శ్రీకృష్ణుఁడిట్టి దీని నీ సమయంబున నరసినచో మేను మఱవకుండునా?

సత్య— తన మేను మఱచునో లేదో తెలియదు కాని నన్ను మాత్రమిప్పటికిఁ దా మఱచెనని యే భావించెదను.

బృంద— ఏమట్లనుచుంటివి?

సత్య— అతఁడింతదనుక రుక్మిణీమందిరంబుననే యున్నట్లు నీ వేకదా తెల్పియుంటివి.

బృంద— నేనచ్చట వానిని గాంచినందుననే యారీతి నీతోఁ జెప్పియుంటిని.

అర— నిఖిలకాంతామనోహరుండగు నా గోపాలుఁ డొక చోట నుండునని యుద్దేశించుచుంటివా? ఒక్కదినమందుననే యీతని నే నన్నిరూపారులు మిత్రవిందమందిరంబునను నా తరుణముననే కాళిందీకేళీగృహంబునందును, నాసమయంబున నే జాంబవతిసదనమునను నావేళనే లక్షణావక్షస్థలంబునను, సాయందనుననే భద్రవిద్రిగృహమున

నను నింక ననేకస్థలంబులఁ జెలఁగుచుంట నేను దినివారేఁ దిలకించిమి యుంటిని. అట్టివానికి నీవొక్క లెక్కయా?

బృం— (అరవిందపైపునఁజూచి) సచ్చేలీ! నీవట్లనవలదు. మాధవునకు మనదేవియందునఁ గలయంతటి యనురాగమింకే తెఱవ యందును లేదని నేను ముమ్మాటికిఁ జెప్పఁగలను.

సత్య— సఖియా! బృందా! నీమాటలే యథార్థంబులయినచో నాథుఁడేల యింతవఱకు మనగృహంబునకు రాఁజాలకుండెను?

బృం— అదియెవ్వరెఱుంగుదురు? రుక్మిణీభుజపంజరంబున బంధింపఁబడిన యాయదుకీరమీకొమ్మకడ నెట్లు వ్రాలఁగలదో తెల్పుమా!

గీ॥ మాయాదారి రుక్మిణి బహు ◆ మంత్రములను
గట్టి వానిని నిసుమంత ◆ గదలనీక
కట్టెనట నిల్పుకొనెను బిం ◆ కంబుమీఱ
నెట్టులాభుజంగుఁడిటకు ◆ నేగుదెంచు?

అర— దేవీ! యేల యూఱక లేనిపోని యనుమానములఁ బడి యాదేవునకు నీపయింగలకూరిమి నీరీతిఁ దరుఁగఁ జేయించుకొనెదవు? ఒక్క క్షణము మిన్నకున్నచో నా పన్నగమర్దనుఁడు నీ సన్నిధినిఁ బ్రసన్నుఁడు గాకుండునా? నీవిలువయు, నీసౌందర్యాతిశయమును, నీవాక్చమత్కృతియు, నీశృంగారవైఖరియు, నీ తెలివితేటలును నీవే యెఱుఁగక బేలవగుచుంటివి! (అని దిక్కులఁజూచి) అదిగో యెవ్వరోవచ్చుచున్నట్లున్నది! ఆ సవ్వడి నాలకించుచుంటివా!

సత్య— బృందా! నీవావలకరిగి యా వచ్చుచున్నవారెవ్వరో చూచివచ్చెదవా?

బృం— ఇదిగో! వెళ్లుచున్నాను (అనివెళ్లును)

అర— ఆతఁడే! కృష్ణుఁడయినచో నీ మనస్సంతోషమారును గదా.

సత్య— సంతాపమారుటయె కాక సర్వమనోభీష్టంబులను దీరుననియే నమ్మెదను.

బృం— (ప్రవేశించి) దేవీ! అవచ్చుచున్న యాతఁడు గోవిందుఁడే. ఇఁక నీ కోపముఁదనివారఁ దీర్చికొనుము. అరవిందా! రా రమ్ము.

(బృందారవిందలిద్దరు నిష్క్రమింతురు)

సత్య— ఇప్పటికిఁగదా నాప్రాణేశ్వరునకు నాపై మనసు గలిగినది. రానిమ్ము. ఇంతవరకు నన్ను మఱచి యుపేక్షించుచున్నందులకు వీనికిఁ దగినట్లు ప్రవర్తించెదఁగాక (అని ముఖముఁ ద్రిప్పికొని కోపముతోఁ గూర్చుండును.)

కృ— (ప్రవేశించి సత్యభామను జూచి) ఏమి? యీవనితామణి యెట్లు నంగీకృతాంతరంగయై మిన్నకుండుటకుఁ గారణమేమై యుండును? అనుదినమును మున్ను నేనువచ్చునప్పటికి జిలిబిలిపలుకులఁ జేయాలాపములు సేయుచు నాతో నమితసంతోష సల్లాపంబుల నాడుచు, నాహృదయంబునకు సంపూర్ణానందమొసఁగూర్చుచుఁ బరఁగెడు నీవు యీభంగి నుండుటకు హేతువేదొ? ఔరా! నే నింత వెఱ్ఱినా! ఈవిధమున నీవు భాసిలుటకిది యొకకొత్తయా! (అని సత్యభామ కెదురుఁగ నిల్చి)

చ॥ చెలియరొ! వేలు పక్కఁగనక ♦ చెక్కిలి హస్తముఁ జేర్చి సిగ్గునక్కఁ
దల నిసుమంత వంచికొని ♦ తల్పము నన్నొదఁ జేర్చవేల? నీ
లలితవచోమనోహర వి♦లాసము వీనులఁ జూపవేల? హా!
యలిగితి వొకొ నా కొఱఁగల ♦ యాఁతను దెల్పినఁ దీర్చకుందునే॥

సత్య— నన్నుఁ బ్రేయసీ యని పిలిచెదవేల? నీచే నట్లు పిలిపించుకొనఁబడుట యారుక్మిణికిఁ జెల్లినది కాని నాకేటికిఁ జెల్లును? మనవిచ్చుట మాటలిచ్చుట యను సంగతి నేఁడు నాకెఱుక యథార్థమయ్యెనది.

ఉ॥ ముద్దులపంచు ముక్కువిరు ♦ పుల్ మిటిప్పించును మోహముల్ [పగల్
పద్దులనందు సంతతము ♦ బద్ధములిందు రసప్రసంగముల్
విద్దెలు నీటులందుఁ జెను ♦ వింతలుగంతులు నిండ్రుఁ జాలునీ
సుద్దుల నేనెఱుంగుదును ♦ జోద్యములయ్యెడు రుక్మిణీసఖా!

(అని బుగ్గఁ బోటుఁ బొడుచును.)

కృ— ప్రాణేశ్వరీ! నేనురుక్మిణీసఖుండనుగాని నీకుమాత్రముగానా? ఆపెకేమి తీపి మేపియుంటిని? నీకేమి చేదు మేపితిని? పైఁబెచ్చునిన్నె ఘనతరంబుగ భావించుచుండ లేదా? నీముచ్చటలఁగూర్చియు నీసౌంద ర్యాతిరేకమునఁగూర్చియు నీయౌన్నత్యమునెంచియు నేను గావించి న ప్రియకార్యపరంపరలనైన నొకసారి జ్ఞప్తికిఁదెచ్చికొనుము.

సీ॥ మున్ను నీజనకుండు ♦ మోపిననిందకై
పడరానిపాటులఁ ♦ బడఁగ లేదొ?
నీ కోర్కె నెరవేర్పఁ ♦ బాకారితోఁదొల్లి
పారిజాతమునకై ♦ పోర లేదొ?
నీముద్దుఁ జెల్లింప ♦ నెమ్మి నారదమహా
మునిఁగొల్చి కష్టముల్ ♦ పొంద లేదొ?
నీయందు మక్కువన్ ♦ జెందినీమితిమీఱు
టల నెంచక మొనది ♦ నలత లేదొ?

గీ॥ యొకటి రెండు మూడననేల ♦ యువిదనీకు
నాతనువుధారవోసితిన్ ♦ గాదె! యట్టి
నన్ను సర్వవిధంబుల ♦ నెన్నిపేర్మిఁ
గూడి కనులార నొకసారిఁ ♦ జూడరాదొ!

సత్య— ఈపల్కులకేమి? ఒక్కదివసంబున నన్ను సంతో షమహామహీజశాఖాగ్రంబున నునుచుటయుఁ దరువాత నొక్క యుగము దుఃఖవార్ధిని ద్రోయుటయు నీకుఁ జెల్లినది!

ఆ॥వె॥ "ఆదివారమందు ♦ నందలంబును స్తుతి
సోమవారమందు ♦ జోలె" యనెడు
శాస్త్రపథము నెంచి ♦ యాచరించుచునుంటి
ఆహాహా! నేను చుల్క ♦ నైతినిక॥

కృ—ప్రియురాలా! యిది యేటిమాట! నే నేవిధముననైన నీకు లోపము గావించితినా? అకారణంబుగ నేల యీమాడ్కి నల్కజెంది నాతో సంతోషముగానలపక యల్కనొల్లవు!

సత్య— నీకు నాయందభిమానము శూన్యమైనను నీవచనంబులతీరును వేషమును యథావిధిగ నలరుచున్నందులకైన నలరుచుంటిని!

గీ॥ భువనమున లేని యిచ్చక ♦ పుణ్యబలుకులు
బలుకులుగా వేషమింతె క ♦ ల్గుటయె కాని
ప్రేమ లేదయ్యె నిసుమంత ♦ 'విగ్రహంబు
పుష్టి; నైవేద్యనష్టి' యనగ ♦ పోల్కి నహహా!

కృ—పోనిమ్ము మద్దలోలి కెడు నొకమాటనైన నాడితివి! ఇంతటనయిన నీ చలము వీడి నిశ్చలమది నన్నాదరింపుము.

సత్య— నీ కెచ్చెచ్చట మచ్చికగల మచ్చకంటులు గలరో యచ్చటనే నీ వచ్చినరీతి నీ యిచ్చకంబుల నుచ్చరించి కాలము బుచ్చుము.

కృ— చాలును. ఇదియాతుదకుం దెల్పితివి? మనోనాథుని తో నిట్లనుట నీకుందగునే?

సత్య— తగునదియే కాన నీకుందగిన తెఱంగున బలికితిని.

కృ—అట్లయిన నా కడసారి ప్రార్థనమునయిన నంగీకరించెదవా?

సత్య—అంగీకరించుటయు, నను గ్రహించుటలును నీ వశము ననే యున్నవి కదా! ఇంతకును నిన్ననేల?

మీ జాతిని విశ్వసింపఁ గూడదు. చనుము.

కృ—ఓహో! మా జాతినిఁ గూర్చియే యెంచుచుంటివా? మా యాదవాన్వయము నీకింత చులకనగఁ దోఁచుచున్నదా?

సత్య— కాదు. మీ పురుషజాతిని నమ్మరాదని నాయుద్దేశము.

కృ— మీస్త్రీజాతిని మాత్రము విశ్వసింపఁదగునా? (అని తనలో)

ఉ॥ కూరిమి యున్నయంతవఱ ♦ కు'బ్రియ! నెచ్చెలి కాంత! మోహనా
కార!మనోహరాంగ'!యం ♦ చమ్మనిపల్కుల నాదరించి యా
కూరిమితగ్గనేనిఁ దుద ♦ కున్ గనులేనియు నెత్తి చూడఁబో
రీ రమణీమణుల్ పురుషు ♦ లెన్నఁడు నమ్మఁగరాదు వీరలన్॥

కృ— మఱియు నిట్టివారలు మాటిమాటికిఁబట్టుదలలకును బంతములకును బుట్టినిండ్లు. వారిమాటలు చెల్లిన మనయాటలుచెల్లును. లేనిచోఁ జిల్లిగవ్వకయినఁజెల్లనేరవు! పదఁపడి నొకవేళ మానము చెల్లించినను నయ్యవి గతజలసేతుబంధనములు. ఇట్టికాంతల మానసములు పయోముఖవిషకుంభములు! గోముఖవ్యాఘ్రములు! శరవన సంఛాదితగంభీరసరోవరములు! దర్దురస్వరదర్వీకరములు! వేయేల? ఇట్టికామినీసంఘటనముకంటె బ్రహ్మచర్యంబు మేలు.

సత్య— (కోపముతో) ఇట్టి పనికిమాలిన యుపన్యాసముల నిచ్చుటకుఁగాఁబోలు నిచ్చటకరుదెంచుటకుఁ గారణమయినది! ఇంక నీ సత్యభామ యసత్యభామయనియే భావించుము. (అని లోని కేగును)

కృ— ఏమి యీ సరసిజాక్షి సాహసము! ఈమె నైజ మెప్పటికి నొక్క రీతిగనే యొప్పుచున్నది! దీనికింతటి గర్వాతిశయము నొసంగినవాఁడను నేనే. గోరుచుట్టుపై రోకటిపోటునట్లు కాముని వలనఁ బొందిన పరాభవమునకుఁ దోడుగ నీపడతిచేఁ గూడ నీపరాభవము

బడితినిగదా! పేరలనననేల? ఇవియన్నియు నా బేలతనమువలననే చేకూఱుచున్నవి. కానిమ్ము. ఇందుల కేమయిన మార్గమూహించియా రామునియొక్కయు సీరామరియొక్కయు గర్వము పాసలంబుల నార్పం జూనకున్నచో నామానసమునకుం గుదుటంబడ నేరదు. అప్రియమిత్ర మిప్పుడె సల్లెద్దంగాక! ఈ కృష్ణుని సామాన్యనరునివలె భావించి యిబ్బంగిం జెప్పకయుంగుచుండ మిన్నకుండుట గర్తవ్యముగాదు. (అని తల నూంచి గదివంకం జూచి) భామా! జ్ఞాపకముంచుకొనుము. ఆ రుక్మిణిపై నీకుంగల యసూయతయేకదా నీ కీర్తికిం గళంకమును దెచ్చుచున్నది! నిన్నా యన్నమిన్న సన్నిధినిలిపి మఱియొకసారిచిన్నంబుచ్చకున్నచో నేను వెన్నుండనుగానుసుమా!

(అనినిష్క్రమించును.)

—

ద్వితీయరంగము.

శ్రీకృష్ణుని రచ్చచావడి. కృష్ణుండుకూర్చుండును.

కృ—

ఉ॥ చూచుచు నూఱకుంటి [illegible]! ♦ చోద్యములన్నిటిం గన్నులార, నే
[illegible] పుట్టిదిదెయా! ♦ లేమకు రామునకిట్లు నాపయిన్
[illegible] దుర్గతిని ♦ ద్రొక్కెడ వారలగర్వమంతయున్
[illegible] భాధముచ్చికయ్యిక ♦ వేగిరపాటున సల్పకున్నచో.

మత్ప్రభావంబు నంతయు నెఱింగియు నాసోదరుండాకైవడి నన్నుం గూర్చియా సభాస్థానంబున దూలనాడుటకుం గొంత సహింపంజాల. నా[illegible]ంగకయుం గేవలలక్ష్మీస్వరూపిణియగు రుక్మిణీమహామహి[illegible]లేకయుం సత్య నాకు వ్యతిరేకమార్గంబునం బ్రవర్తించి [illegible] నోర్వంజాల. అభిమానశతమాలతిశయము

ముత్తులాభారసమయంబునఁ దొల్లి నీ జాణ యొకతిఁగియే, యుండియు నాపైని నిత్యమును దూషించుచున్నందులకు నాకబ్బురమగుచున్నది! ఇఁక నేమి గావింపనగును?

( అంతటఁ దెరలోనుండి )

దావా— కృష్ణమహాప్రభూ! యేలినవారిదర్శనముకొఱకు నారదమునీంద్రులు విచ్చేసి యున్నారు.

కృష్ణ— ( ఉలికిపడి ) సెబాసు! అతఁడు మంచి తరుణమునసే వచ్చెను! ( అని ద్వారమువంకఁజూచి ) వానికేమియు నాటంకమును గలుగఁజేయకుము. ( అనితలో ) ఈతఁడు నాయుద్దేశమునకుఁ దగిన ప్రక్రియఁ దప్పక తెల్పఁగలఁడు. మంచిది. బాగు.

( నారదుఁడు ప్రవేశించును )

కృష్ణ— ( ఎదురుగఁజని ) ఓహో! నారదా! వచ్చితివా! ( అని కౌఁగిలించుకొనును )

నార— నీవంటివాని దర్శనార్థ మీ ద్వారకాపురంబునకు వచ్చుట యొకయాశ్చర్యమని తలఁచుచుంటివా? నీ యనుగ్రహ మున్నచో దినమునకుఁ దొంబదిసారులయిన వచ్చి నినుఁ గాంచుచు నుండుదును.

కృష్ణ— అట్లయిన నీవయిని నాకుదయ లేదని తలఁచు చుంటివా?

నార— అట్టిప్రేమ నాయెడఁ గ్రియాభాగమునఁ జూడ నవ్వుడప్పుడు గాన్పించుచున్నదని గదా నీకు నాపయిఁ బరిపూర్ణాను రాగ మున్నట్లు విశ్వసింపఁగలను!

కృష్ణ— ఓహో! యేదయిన గ్రొత్తవిశేషమును దెచ్చితి వా యేమి?

నార — నీ వెఱుఁగని విశేషమొక్కటియును గాదు. నీ చరాశి తు లశేషమదోన్మత్తులయి పరమపురుషులఁగూడ లెక్క సేయకమితిమీఱుచున్నందులకు నా కక్కజమగుచున్నది!

కృ — ఔనవును. (అని తనలో) నా సోదరుని ప్రతిజ్ఞాలాపమును నాసత్యభామాప్రతికూలమానసమును నీతఁడెటిఁగియుండు నే నాటలోలున! అయినను గనఁగొనెద. (అని నారదుని వంకఁజూచి) అజతనయా! నీ యాడినమాటల యర్థమెఱుఁగుమము. ఆయా ప్రతిఫలముల ననుభవించువాఁడను నేనయి యుండ నీవేలయుల్ల లాడెదవు?

నార — ఏమి! యాగరుడోన్మాదానలంబు వీనికిఁగూడ సోఁకియుండునా? (అని కృష్ణుని వైపునఁజూచి) దేవా! ఆయా దుష్ఫలముల ననుభవించెడు వారమును ననుభవించుచున్న వారమును మేముగాని నీవెన్నఁటికిని గాఁజాలవు.

కృ — ఏమట్లనుచుంటివి! మా రాముని వలనఁగాని లేనిచో సాత్రాజితివలనఁగాని నీకు నేమయిన హాయిడి గల్గినదా?

నార — వారలవలన నాకెట్టి యాఘాటమును గల్గియుండలేదు. ఒక వేళఁగల్గినను దాని నొకమేలువలెనే గణించి యుందును. నే నంతటి ధన్యుండనుగాను. ఒకపక్షికులాధమునిచే నేను దృణప్రాయంబుగఁ బరిగణింపఁబడినందుల కెంతయును బొగులుచుంటిని.

కృ — (తనలో) ఏమి! పక్షికులాధముఁడా! ఒక వేళఁ గరుడుఁడైయుండునా? (అని నారదుని వైపునఁజూచి) అట్టిసంగతి యేలోకంబున నెప్పుడు జరిగినది?

నార — వైకుంఠంబున నీయాదిమూర్తియగు శ్రీమన్నారాయణుని నేను సందర్శింప నేగుతరి నచ్చటివారెల్లరు నను సన్మానింప నొకమూల తెక్కలు మూల్చిన కొండవలెఁ గదలక నాతో నకారణం

బుగఁ గష్యమునకుఁ గాలుద్రివ్వనెంచి, నిర్లక్ష్యవీక్షణంబుల నను వీక్షించుచు నించుకయు నరకుసేయక నన్నుఁ బలుకీతులఁ దూలనాడిన యూ వైనతేయునిఁ దలఁచుకొనిన నామొసలు మండుచున్నది. కాని నేనేమి చేయఁగలను?

కృ—అట్లయిన నాతో నీసమాచారమును దెలుపుటకా యరుదెంచితివి?

నార—తెలుపుటకే కాదు. నీమహిమచే వానిమదంబు నీటఁగలుపుటకుఁగూడఁ దలఁచివచ్చితిని.

కృ—మన యిరువురి సంగతుల నాలోచించుకొనినచో నాలుమద్దెలల సామ్యంబుగఁ దోఁచుచున్నది!

నార—మహానుభావుఁడవగు నీవే నాతో నరిఁబోల్చుకొనుట యెందులకు?

కృ—ఎందులకా?

శా॥ నేరం బేమియుఁ జూపకే నను మహా ♦ నీచుండనంచున్ మహో
జోరాత్మ్యుండనటంచు దుష్టుఁడనఁటం ♦ చుణ్ బెక్కుభంగుల్ గడున్
మా రాముఁడు ద్రుణీకరించి సభకున్ ♦ రానీయవద్దంచుఁబల్
సారుల్ నొక్కి వచించెనంట యిదియా ♦ సన్మార్గమవ్వానికిన్?

ఆమాటకేమి కాని; నా ప్రియసియగు సాత్రాజితియు నేఁటినుండి నా మాటఁ బాటింపక వ్యతిరేకమానసయై విజృంభించుచున్నది!

నార—ఇందులకే నీవింత తల్లడమొందుచుంటివా? వారిద్దఱు నీవారలే కారా? నీవారివలన నీకెట్టి చిన్నతనము గల్గినను బ్రమాదమేమి? పెఱవారలవలనఁ జేకూరినపుడుగదా నావలె ఖేదమొందుట దగును.

కృ—సత్యమును, సన్మార్గమును దప్పి ప్రవర్తించువారలు నావారలైననేమి? ఇతరులయిననేమి? పిన్నలయిననేమి? పెద్దలయిన-

సీ॥ చిన్ననాఁటన సూర్య ♦ బింబమున్ మ్రింగంగ
మింటిపై కెగసిన ♦ మేటియతఁడు
గంభీరతమలవ ♦ ణాంభోనిధిని నొక్క-
గంతున దాటిన ♦ ఘనుఁడతండు
పదినోళ్లఁబడి రక్త ♦ వాహినుల్ గారంగ
దశకంఠు నొంచిన ♦ దండియతఁడు
కొండల నఱచేతఁ ♦ బెండులుగాఁబట్టి
విసరివైచిన మహా ♦ వీరుఁడతఁడు

గీ॥ సకలలంకాపురీ నిశా ♦ చర మహీజ
బృందసాంద్రఘోరాటవీ ♦ వీతిహోత్రుఁ
డౌర! యతఁడన్న సామాన్యుఁ ♦ డా నే? సుగుణ
వంతుఁడు మతిమంతుఁడు హను ♦ మంతుఁడహహ!

నార—అతఁడా రామావతారమునాఁటి వాఁడుగదా! ఇంత వఱకు జీవించియున్నాఁడా?

కృ—ఆ మహానుభావుఁడు చిరంజీవి యని తెలిసికొనుము.

నార— అట్లయిన నాతఁడిప్పుడేస్థలంబున నేరీతి భాసిల్లుచుండును?

కృ—ఆ నా భక్తాగ్రగణ్యుఁడు వానరశ్రేష్ఠుఁడని నీవెఱిఁగియే యుందువు. ఇప్పుడు హిమవత్పర్వతకంధరమున రామమూర్తినిఁ గూర్చియే ధ్యానించుచుండును.

నార—అట్టివానిఁ నూఱక పల్కరించినచో నా గరుత్మంతునికిఁ గావింపఁబడునది నాకే యొనరింపఁబడునేమో!

కృ—వానిని నీవు మాటాడించవలదు. (అని యించుక సేపుండి) మఱచితిని. వానికి ద్వాపరయుగంబున రామరూపమున దర్శనమిచ్చుటకు నాచిత్తము కడుఁ దత్తరిలుచున్నది. కాన, దోడ్కొని రమ్ము. ఆవల సలుపఁబడు కర్తవ్యము నేనే యాచరించెదను.

నార — కృష్ణా! బాగు! బాగు! నా మహతీగానకాకలము కోవాళావళిలో నాతని నిసుమంత ముంచి మేను మఱచునటులొనర్చి యుల్లన వెంటనే కొని వచ్చెదను. నాకింక సెలవొసంగుము.

కృ — జాగ్రత్తగఁ బోయిరమ్ము. ఆతఁడు రామభక్తుఁడనియేదు మాట మాత్రము మఱవకుము. వానికడ వేఱేప్రసంగమునుఁ దెచ్చెదవేని నిన్నాతఁడువిడచి పుచ్చుటకల్ల. బ్రహ్మయొక్క పేరుఁదెల్పినను రుద్రునిఁ దలఁచుకొనినను దుదకు నన్నెంచినను గాని యాతఁడు లెక్కసేయఁడనియే నమ్ముము.

నార — సరియే! యేమాడ్కినయిన వానిఁ దెచ్చుట నాపని పైఁబనులఁ గావించుట నీయదే భారము. (అని నిష్క్రమించును.)

కృ — తగిన సమయంబునకు వచ్చినందున నీనారదునిపైఁ దగిన కార్యభారమే వైచినాఁడను. అయిన నీతఁడామారుతిని వెంటఁబెట్టుకొని వచ్చునోలేదో! ఒకవేళ నాతనిఁ గైకొని రాఁజాలనిచో నేమిసేయనగును? దీనికేఁగార్యసిద్ధియగునని యె తోఁచుచున్నది. ఈ ఖలతాముని గర్వభంజనమా ప్లవగకుంజరునిచేఁ గాక వేఱే ధీరుని చేతనయినను గానేరదు. ఇదియే రమ్యమగు మార్గముపలె గన్పట్టుచున్నది. మంచిది. (అని నిష్క్రమించును.)

## తృతీయరంగము - అడవితోవ.

నార — (ప్రవేశించి) అశేషప్రమదాంధుండగు నావైనతేయు నొంకుటకు నాకుఁ గలిగిన తలంపుచేఁ గదా యిట్టి నిర్జనప్రదేశంబుల, నిట్టఘోరాటవీస్థలంబులఁ గ్రుమ్మరుచుఁ బ్రతిసీమను వెదకుచు, నిఖలగహ్వరద్వారంబులఁ బ్రవేశించుచు, సర్వనికుంజపుంజములఁ నన్వేషించుచు, నిట్టి కాయకష్టపరంపరల నీరీతి నేను పొందవలసి వచ్చినది. అయిననేమి? ఈతావు తుహినాచలప్రాంతము యగు

యగుటవలన నాకిఁక నెంతయో ప్రయాసము చేయఁబనిలేదు. ఆవనచరసింహుఁ డిప్పుడ యీహిమగిరి యుత్తరభాగంబుననే యున్నాఁడని శ్రీకృష్ణుఁడింతకు మున్న నాకుఁ జెప్పియుంటచే నాకష్టము లెల్లఁ దీర్ఘకాలముననే ఫలించుననుట యథార్థము. అయిన నాతనిజాడ యొక్కింతయుఁ దెలియకున్నది!

శా॥ ఏకుంజంబున నుండునో-గుహాలయం ♦ బే దూరెనో-కాక యే
కొండం దనరారునో యెచటఁ ద ♦ న్వీక్షింతునో తోఁచదా
లోకారాధ్యుని మాట నమ్మఁగునో యా ♦ లోచింపనా కోర్కె హా!
చేకూఱంగలదో హుళిక్కియగునో ♦ చిత్తంబెటుల్ నిల్చునో!

ఇంతేకాక యా బలవంతుండగు హనుమంతుండు శ్రీరామభక్తాగ్రేసరుండని వింటినే! అతఁడీచెంత నెచ్చటనైన నున్నచో నాయాశాదాహము దీర శ్రీరామ నామసంకీర్తనామృత ఝురీశీతలోన్నత భంగోపరి నాగ భాసితసితడిండీరంబులయినఁ దోఁచకుండునా?— ఎచ్చట నట్టి సవ్వడి లేదయ్యె. ఆమహాత్ముఁడీస్థలమునకుఁ గడు దవ్వుననే యలరి యుండవచ్చును. తప్పక యీ ప్రాంతముల నెల్లఁ బరికించెదఁ గాక. ఇంతలో నధైర్యమొందనేల? దక్షప్రజాపతిచేఁ దొల్లి నాకొసంగఁబడిన వరప్రభావంబున సకల లోకసంచారంబుఁ గావించుచున్న నాకు నొక్క యీ హిమాద్రి లెక్కయా? కలశపాత్రమహీషాభిషేకమొనర్చువానికి నొకసాలగ్రామాభిషేకము లక్ష్యమా? కాదుసుమా. ఓ వైనతేయా! నిష్ప్రయోజనకారా! నే నిన్ని యిడుములఁబడియయిన నిరొల్లడలునడఁగి యున్న మదమును గ్రక్కింతునని తో. ముమ్మాటికి నమ్ముము. ఈ బ్రహ్మవ్రతుఁడు నీకింతటనుండి బద్ధశత్రుఁడనియే తలంచుకొనుము. (అని యించుక నేవూరకుండి) ఏమో! రామనామము వలె వినఁబడుచున్నది! (అని నాలుగువంకలఁ జూచి) యిటుల నివ్వడాకర్ణింపఁబడుట లేదే! ఆ కురువీరులకును నేను బలుమారులు

ణువమునఁ దలఁచుటచే నట్లు తోఁచియుండును. ఒకవేళ నిజముగా నట్టి నామస్మరణంబును సలిపెడు నా దివ్యపురుషుండు నాకుఁ గట్టెదుటఁ దటస్థమయినచో వాని నెవ్విధంబున ద్వారకకుఁ దోడ్కొని పోఁగలను! నిఖిలదేవతానిర్జితమహాబలసమేతుఁడగు వానితో నెట్లుంగాఁ బ్రసంగింతునో తెలియకున్నది. తుదకేది యెట్లువచ్చునో! అయినను భయమేలా? నామహతియు, నాగానశాస్త్రియును, నా దరినుండ జగంబున నాకేకార్యమయిన నిర్వాహమగునా? ఆ యారావమా వైపుననుండి వచ్చుచున్నది కాన నాదిక్కునకే చని, యరసెదఁగాక.

(అని నిష్క్రమించును.)

---

## చతుర్థరంగము.

### హిమగిరిప్రాంతము.

(ఆంజనేయుఁడు గన్నులు మూసికొని తపమాచరించుచుండును.)

నార—(ప్రవేశించి) తుదకెట్లయిన నిచ్చటకుఁ జేరితిని. ఈవల నెంత దవ్వేగవలయునో తెలియకున్నది. మార్గమయిన నిసుమంతయుఁ గన్పడలేదయ్యో! (అని నలువంకలఁగని) ఘోరతపమాచరించుకొనుచుండిన యా మర్కటశార్దూలుండే నేననుకొనినట్టియు గోపాలచూడామణి నాకుఁ దెల్పినట్టియు మహానుభావుండైన యాంజనేయుఁడైయుండనోపు. ఆహా! రామావతారకాలమునాఁటికిని నేఁటికిని వీఁడెంత మారుపుఁజెందెను? ఇంక నీతని నిత్తావుననుండి యాద్వారకకేగతిని దీసికొని చనదగును? మహితతపోనిరతుఁడయి యున్న వీనితో నెట్టిమాటనాడిన నెట్టియుపద్రవము సంభవించునో యని సందేహము జనించుచున్నది. వైష్ణవాంశసంభూతుఁడగు శ్రీరాముని ప్రియశిష్యుఁడితఁడు గావున నే తద్విష్ణువునే యిచ్చట ధ్యానించినచో నితఁడు గదలవచ్చును:

కం॥ ఓవైకుంఠ పురేశ్వర!
శ్రీవర! సద్భక్తజనవ • శీకర! త్రిజగ
త్పావన! దీనజనావన!
కావవె! కరుణాంతరంగ! • కలుషవిభంగా!

ఆహా! యేమియీయాచిత్రము! సర్వజగన్నాథుండగు నాదినారాయణుని, నేనెంతనుతించినను నానుడులు వీనిచెవుల రవంతయుఁ బడవయ్యె! కానిమ్ము. మఱియొకరీతి నాలోచించెద. ఈస్థలమునసుండియే భూలోకంబున కవతరించిన గంగాధవానికి మనోహరుఁడగు శంకరుని భజయించి పరీక్షించెద! ఈవీరాగ్రణి రుద్రాంశసంభూతుఁడే కదా!

కం॥ హర! భవహర! త్రిపురాసుర
హర! కరుణాకర! శుభకర! • యమరనుతి ధరా!
ధరదుహితావర! విమలం
ధర! శశిధర! నన్నుఁబ్రోవ • దయఁజూపఁగదే!

ఆహా! వీనికి నియ్యదియు రుచింపకున్నదే! అయ్యో! మఱచితిని. ఈ మహాత్ముఁడు రఘురామభక్తుండనియెడుమాట నే నెఱింగియు మదాంధుండనై శ్రీకృష్ణభగవానుని వచోసరణిఁ జ్ఞప్తియుంచుకొననేరక యెంత పొరపాటొనరించితిని? కావున సకలరాక్షసవిరాముఁడగు శ్రీరామునే సన్నుతించెదఁగాక!

సీ॥ అతిబాల్యమునఁ దాట • కాసురిఁ వధియించి
రాణించినట్టి శ్రీ • రామరామ!
శశికంఠువింటిని • విఱిచి సీతాదేవి
రహిఁబెండ్లియాడిన • రామరామ!
పవనసందనుని స • న్మానించి ఖలు వాలి
భూమిఁగూల్చినయట్టి • రామరామ!
కడలిఁగట్టి లం • కను జొచ్చి దుర్మత్త
రావణుం దునిమిన • రామరామ!

గీ॥ శిష్టరక్షణంబును దుష్ట ♦ శిక్షణంబు
సమర సల్పిన యట్టి దే ♦ వాభిరామ!
రవికులాంబుధిసోమ! శ్రీ ♦ రామరామ!
రమ్యగుణధామ! జానకీ ♦ రామరామ!

ఆంజ—(కన్నులు విప్పిచూచి) ఆహా! యెన్ని నాళులకీ రామ నామమహామహా నిర్మలామృతరసంబులను మరల నాకర్ణపాత్రంబులఁ గ్రోలుచుంటిని! ఈ మధురారావ మేవైపుననుండివచ్చుచున్నది! త్రేతాయుగంబంతరించి యెన్నియో దివ్యవర్షములయినది. ద్వాపర యుగము గూడ కాలవశమున గతించినది శ్రీరామమహాతారకనామ ముచ్ఛరించు మహనీయులిప్పుడెవ్వరుందురు? ఆహా! నేఁడెట్టి పుణ్య దినము నాకు లభించినది! హా! రామ! (అని చేతులముకుళించును.)

నార—("అతిబాల్యమున" నను, పద్యమును బఠించుచు,) మెల్లగా నిష్క్రమించును.

ఆంజ—ఆహాహా! రామనామామృతము! అంతఃకరణమునాప్లా వించెడు మృదునినద మీ దిక్కునుండియే యాలింపఁబడుచున్నది! ఏమి యీమాధుర్యము! (అని నారదుని వెంట నిష్క్రమించును.)



పంచమరంగము

శవవీథి.

నార—(ప్రవేశించి) ఇప్పటికి నాకోర్కె నెఱవేరఁగలదని కొంతవఱకు నాకాశ కలుగుచున్నది! ఎన్నెన్నియో ప్రయాసంబుల నొందినందులకు స్వల్పకాలమయిన నెచ్చటను విశ్రమింపకుంటిని! ఆ యాఁకలిదప్పులచేఁ దంతకంఠము నాల్కఁ గడుఁ జేరువయగు చుండుటచే శిథిలమగుచున్నది. ఇంత తొందర యేల? ఇంచుకసేపీ తరుచ్ఛాయ

ను గూర్చుచుండి యాతనితో సంభాషించి చూచెద. (అదృశ్యుఁడగుచుండును) (అంతట నాంజనేయుఁడు ప్రవేశించును.)

అంజ — ఇన్నినాళ్లకు మరల ధన్యుఁడనైతిని. నాకు ద్వాపర యుగమున దర్శన మొసంగుదునని నేను నమ్మిన శ్రీయ నా స్వామి చంద్రుఁడు నేఁడిచ్చట నవనీల రామరూపంబున భాసిలుచు నా కెట్టెదుట నిట్లు సాక్షాత్కరించినందున నే నపరిమిత హర్షపూరితుఁడ నైతిని (అని నారదుని సమీపించి సాష్టాంగ దండప్రణామము లాచరించి) ఓరామా! రఘుకుల సార్వభౌమా! ఇన్నిశతాబ్దముల నుండియు భవద్దర్శనంబునకై నా కన్నులు గాయలుగాచినవి!

నార — (లేచి యాంజనేయుని లేపించి) జగత్ప్రాణనందనా! నేను రాముఁడనని యేల తలఁచుచుంటివి? నీకుఁగల దృఢభక్తియు నపరిమితధ్యానంబును నిన్నిట్లు మోసపుచ్చుచున్నవని యెఱుంగుము. నేను రాముఁడనుగాను. నారదుఁడను.

అంజ — అట్లయిన నన్ను నీవేల యిచ్చటకుఁ దోడ్కొని వచ్చితివి?

నార — (తనలో) అన్నా! వచ్చితిగదా! వీని కెట్టి యుత్తర మొసంగఁదగును? (ప్రకాశముగా) నిన్నుఁ దోడ్తెచ్చినవాఁడను నే నెంతమాత్రమును గాను. నన్నింక నాపకుము నా చేఁ బూజింపఁబడు రాము రూపమునయ్యో! ధ్యానింప లేకుంటిని!

అంజ — అయోధ్యాపుర మనుచుంటివి! అది యెచ్చటి యయోధ్య? అందున నీ కేకార్యము గలదు?

నార — ఏమట్లు పొరపాటు పడియెదవు? చిత్రవిచిత్ర గోపురాలంకృతసౌధ ద్వారకవాట వాటికానిచయ భాసితపూర్వాద్రుంపును సకలసుగుణాభిరాముండు నగు దశరథ[illegible] ... నగు రాజచంద్రుని సేవించుటయే యిప్పటి నా కర్తవ్యముగాదా?

అంజ — ఆహా? యీతనిమాట నాలకించిన నా కంతకంతకు

శ్రీరాముని యందాశ మీఱుచున్నది.

నార — (తనలో) ఇతఁడింక నాచేఁ జిక్కినాఁడు.

అ.జ — అహా! రామా! కాకుత్స్థవంశాబ్ధిసోమ!

సీ॥ వనమధ్యమున గండ ♦ పాషాణమును ముద్దు
పడతిఁ జేసిన నీదు ♦ పాదయుగము
సకల మునీంద్రహృ ♦ త్తములచే భక్తిమై
ప్రణుతులన్ గొన్న నీ ♦ పాదయుగము
భక్తాగ్రగణ్యుఁడై ♦ పరఁగిన గుహునిచే
భజియింపఁ బడ్డనీ ♦ పాదయుగము
భూజాత యగు సీత ♦ మ్రొక్కుల నిరతంబు
పడసిన యట్టి నీ ♦ పాదయుగముఁ

గీ॥ గొల్చినాఁడఁ గొల్చుచునుంటిఁ ♦ గొల్వనుంటిఁ
గూర్మిమీఱఁగ దరిఁ జేర్చు ♦ కొనఁగదయ్య!
రామ! సద్గుణస్తోమ!సం ♦ గ్రామభీమ!
శాత్రవవిరామ! రాఘవ ♦ రామరామ!

(అని ముందునడచును.)

నార — ఇప్పటికి నామనోరథము ముప్పాతిక మువ్వీసము కొనసాగినది! ఈపవనతనూజు నింతదవ్వు తోడ్తెచ్చితిని. ఇఁకఁ దిన్నఁగ ద్వారకాపురవరమునకుఁ గైకొనిపోవుటయె కొదువ. నామనంబునఁ గలద్వారకాపురము నయోధ్యానగరమని భావించియు, నేను దలంచుచున్న శ్రీకృష్ణమూర్తిని రామచంద్రమూర్తి యని యుద్దేశించియు నీహనుమంతుఁడు నావెనువెంట మంత్రముచేఁ గట్టువడిన మహాభుజంగముమాడ్కి శ్రీరామ తారకనామ మహామంత్రప్రభావనిబద్ధ మానసుండయి వచ్చుచున్నవాఁడు! ఒకవేళ ద్వారకను గాంచి మోసమునెఱింగి నన్నేమయిన నతఁడు గావింపనెంచునా? అట్లయిన నేమిసేయనగును? ఆ పట్టణమును జేరినచో నటువయిని

నాకేమి భయము గలుగును? అన్నిటికిని వాసుదేవుఁడే కలఁడు. (అని వెనుకకుఁ జూచి) అదిగో! మారుతి నాకుఁ జేరువనే యున్నవాఁడు. (అని మఱియుఁ బాడును.)

ఆంజ—(ప్రవేశించి నారదునితోఁ గూడఁ బాడును.)

నార—ఆహా! తుదకు నీ పవనసూనుని ద్వారకాపురప్రాంతమునకుఁ దోడ్తెచ్చితిని. ఇంతవఱకు నట్టిటో యాతఁడయోధ్యయనియెడు నాకిచే నా వెనువెంట నే వచ్చియుండెను. ఇంక నేమి కావింపవగును? (వనము ద్వారకాపురవీథిగా మాఱును)

ఆంజ— నారదమునిచంద్రమా! ఇప్పటికి మనమీ పట్టణముఁ జేరఁ గల్గితిమి. ఇయ్యది యెంత రమణీయముగఁ గన్పట్టుచున్నది? మా సకలవానర నివాసంబగు కిష్కింధయే గొప్ప పట్టణమని కొంత కాలము తలఁచియుంటిని. తరువాత శ్రీరామకటాక్షంబున లంకానగరంబును గాంచి యదియే సుందరతరమని యెంచినాఁడను. పదంపడి సాకేతపురమారసి అందుఁగల బహువిధ గోపుర ప్రాకార స్తంభవిచిత్ర కుడ్యభర్మ్యహర్మ్యదుర్గరాజంబులకీ చతుర్దశ భువనంబుల సాటిలేదని యెంచుకొంటిని. అట్టి మహారమణీయపురవరంబును సైతము పురిడించు నీ నిరుపమాన నగర మియ్యదియుఁ దెలియుచున్నది. దీనిఁ బరిపాలించు ఱేఁడెవ్వఁడు?

నార— దీనిసంగతి మనకేందులకు? అయినను దెల్పెద వినుము.

మ॥ వరపుణ్యస్థలమై యశోభరితమై ♦ భక్తాళికిం గొంగుబం
గరునా నొప్పుచు రామపాలనమునన్ ♦ రాణించుచున్ మించుచున్
నిరతశ్రీకరమై శుభప్రదమునై ♦ నిర్భేద్యమైనట్టి యీ
పురరాజంబహా! ద్వారకానగరమై ♦ పొల్పారు ధాత్రీస్థలిన్।

ఇయ్యది సముద్రమధ్యమున నెలరుటచే నెట్టి శత్రువులేనియు దీని వంకఁ గన్నెత్తి చూడఁజాలరు. జరాసంధునివంటి మహాయోధుఁడు

స్థైర మిత్త్వమును గన్గొనలేక విఫలమనోరథుఁడయ్యెను!

ఆంజ— దీనిఁ బాలించు నేఁటిమీఁదు రాముఁడని కదా తెలుపుచుంటివి! ఆహాహా! యిన్నినాళ్లకు నేను ధన్యుఁడనైతిని! హా! రఘురామ! కన్నులయెదుట నీవు బాణతూణకోదండధరుండవై నిత్యమును నాకుఁ దోఁచుచునేయుంటివి.

నార— మారుతీ! యీపురాధిపుఁడు [illegible]నుచున్న రఘురాముఁడని యూ భావించుచుంటివి?

ఆంజ— మఱియేమి? లేకపరశురాముఁడా? కానేరఁడు. ఆ మహామహుఁడు మా సీతారామునిచే జయింపఁబడి నేఁటివఱకు మహేంద్రాచలమునఁ దపము గావించుకొనుచుండ నిచ్చటి కెట్లు రాఁజనును?

నార— అతఁడును గాఁడు. ఆ మహాత్ముఁడు భూసురకుల సంజాతుఁడు. ఈమహాబలవంతుఁడు యదుకులోద్భవుఁడు,

ఆంజ— యాదవాన్వయమున రాముఁడనువాఁడు గూడఁ గలఁడా?

నార— ఆహా! కలఁడు. ఈతనికిఁ గేవలరాముఁడనియే కాక బలరాముఁడని కూడఁ బేరు గలదు.

ఆంజ— ఏమీ! బ-ల-రాముఁడా! మా రఘురాముని కన్న బాహుపటిమంబున మేటియా? వీని కట్టి పేరెవ్వరొసంగిరి?

సీ॥ వసినాఁడె యసురుల ♦ వసలార్చి కసిఁదీర్చి
క్షేమంబుఁ గూర్చిన ♦ రామవిభుఁడు
పంచశిఖలనాఁటి ♦ పౌరుషంబున భృగు
రాము గెల్చిన రఘు ♦ రామవిభుఁడు
వనవాసమందునై ♦ నను శరణాగత
రక్షణుండైన శ్రీ ♦ రామవిభుఁడు
రావణకుంభకర ♦ ర్ణమహా రణాంగణో
ద్దాములఁ దునిమిన ♦ రామవిభుఁడు.

గీ॥ తపర జయరామ బలరామ ♦ ధర్మరామ
మహితసుగుణాభిరామ నా ♦ మముల నెన్నఁ
బడుట కెంతయు జగములఁ ♦ బాత్రుఁడహహా!
వరునికై చెల్లనేరదా ♦ పదము నమ్మ!

నార— (నవ్వుకొనుచుఁదనలో) నాకీరోజున నుపవాసమే యగునని నమ్ముకొని యుంటిని. కాని మంచిభోజనమే లభింపనున్నది. ఈతఁడు నాదారిలోనికే వచ్చుచున్నవాఁడు. (అనిఆంజనేయునితో) అదియేటిమాట! వసుదేవనందనుండును, ప్రలంబగార్దభాద్యనేకనిశాచరసంహారుండునునగు నీప్రజ్ఞావంతుఁడు మాత్రమట్టి వాఁడుకాఁడని తలంచుచుంటివా?

ఆంజ— ఆసంగతిఁబలికించెదఁగాక! ఇట్టి రాములు పదుగురైనను నూఱుగురైనను, వేయిమందియైనను మా జానకీ రామునితో సాటికాఁజాలరని ముమ్మాటికిని నమ్ముము. ఇట్టి నామముఁ దాల్చుట కీతఁడనర్హుఁడుగాన. నీవీక్షణంబునన వీనికడ కరిగి యా బ-ల-రామనామంబు 'నబల' రామ యని సవరించుకొనుమని తెల్పుము. లేనిచో నా 'బల' యను రెండక్షరంబులను జెఱిచివైచికొని వేఱొద్దానినైనఁ జేర్చుకొన వలయునని వీనితో గట్టిగాఁ దెల్పుము. అట్లు కావింపనిచో నుచితదండనంబొనంగఁ బడునని కూడ బోధింపుము. నీకు శ్రమయొసంగినందులకు నన్ను క్షమింపుము.

నార— నాకిదిశ్రమయా! ఇది నాపనియే యని యెఱుఁగవు కాబోలును! నీవుచెప్పిన రీతిగనే యా రామచంద్రునితో విన్నవించెదను.

ఆంజ— విన్నపముగాదు. ఆజ్ఞాపింపుము.

నార— బహుబాగు. (అనివెడలును)

ఆంజ— ఈనరాధముఁడీ మునివర్యుని మాటల నాలించునా? కన్నులఁగావరముఁజెందిన భూకాంతులు సాధుల సల్లాపంబులఁ బరిగణింతురా? ఎట్లయిననేమి? తొల్లి, లంకాపురంబున నక్షసంహారమునకు మున్ను నేను గావించిన ప్రక్రియనే యిచ్చటను సల్పెదను

గాక! అదిగో! ఆవంక నుద్యానవనమొండు రమణీయముగఁ గన్పట్టు చున్నది. (అని ఆర్పుచు నిష్క్రమించును.)



## సప్తమరంగము. బలరాముని సభాభవనము.

బలరాముఁడు, అక్రూరుఁడు, సుబాహుఁడు, గదుఁడు. మొదలగువారు [కూర్చుందురు.

బల— యదువీరులారా! యింతకు మున్ను మనమంపిన యాజ్ఞానుసారంబుగఁ గృష్ణుఁడు మన సభాభవనమునకు రాకయే కాలముఁ బుచ్చుచుండెను. ఇంతటనైన నాతని దుష్ప్రవర్తనమును మానుకొనుచుండెనని తలఁచెదను.

సుబా— దేవా! మీ యానను జవదాఁటనేరక యేస్థలంబున కేగక . కడు ఖిన్నుఁడై నిజాంతఃపురముననే నేర మొనర్చినవానికిఁ బ్రియ సఖిగ యున్నవాఁడు.

అక్రూ— ఇవల నైన నా మహానుభావునిపయిఁ గనికరించి పూర్వము భంగి నిచ్చటకు యథేచ్ఛగ వచ్చుచుఁ బోవుచుండుట కు ననుజ్ఞ నొసఁగవలదా?

బల— వానిపేరు వినినంతనే నాయొడలు మండుచున్నది. వానిఁ గూర్చి యిసుమంతయు నాకడఁ బ్రశంసింపకుఁడు.

(అంతటనారదుఁడు ప్రవేశించును.

(బలరాముఁడు మొదలగు వారులేచి నిలుతురు)

బల— (ఎదురుగవచ్చి) మునికులతిలకమా! నావందనంబు లఁగైకొని యీ యాసనంబున దయ సేయుఁడు (అనిచేయిఁజూపును)

నార— నీవందనంబు భగవత్ప్రీతికరంబగుఁగాక!

బల— దేవా! మీ పదనారభోజము గాంచినచో ననేకార

ణంబుననో కను తత్తరపాటున నరుదెంచు చున్నట్లు నాకుఁ బొడఁ గట్టుచున్నది.

నార—అందుకుఁ దగిన హేతువు గలదనియే నమ్మెదము.

బల—అట్టి దెద్దియో తెల్పెదరా?

నార—తెల్పకేమి? సకలద్వారకాపురజనోత్సాహాకరంబగు మీ నందనవన మిల్లుఁ బెల్లగింపఁబడుటచే విచారించుచుంటిని.

బల—ఏమీ! తొల్లింటి జరాసంధసైన్యహతశేషవర్గంబుల నెవ్వరేని మగుడ మనద్వారకను బ్రవేశించిరా?

నార—లేదు. ఆరమణీయారామ మొక యల్ప వనచరునిచే నింతను పాడు సేయఁ బడుచునే యున్నది. శ్రీకృష్ణబలరామదేవ స్వచాతుర్యసమార్జితద్వారవతీపురకంఠాభరణమో యనఁబరఁగు నా వనంబిట్లు నాశన మొనరింపఁ బడుచుండె నొక్క యదుసింహకిశోర మయిన వారింపకున్నందులకు నాకక్కజమగుచున్నది!

బల—ఆ తులువ మొకమున కంతటి సత్వముగూడఁగలదా?

నార—అట్టి శక్తియే కాదు. అయ్యది నరునివలె మాటల గూడ నాడఁ గడఁగె!

బల—ఏమి యీవిశేషము?

నార—ఈవిశేషమున కింతక శేషము గూడఁగలదు. అయ్యది సామాన్యప్లవంగంబు భంగిఁగాక నను గని వెంటనంటి యీ పురాధిపుఁడెవ్వఁడని ప్రశ్నించె.

అక్రూ—ఎంత యాశ్చర్యము!

బల—తెల్పితివా!

నార—తెల్పకేమి? సకలాసురసంహారక్రియాధురీణుండును, నానాబృందారకవందిబృందవందితమంజులచరణారవిందుండును, బరమ దీనశిష్టజనాపాయమహోదర్వీకరమయూరుండును నగు బలరాముఁడని గట్టిగా నొక్క తెల్పియే యుంటిని.

బల—అప్పుడయిన భయమొంది పోకుండెనా?

నార—భయ మొందకుండుటయే కాక నీ నామంబాలించి నంతనే తోకఁ ద్రొక్కిన త్రాఁచు వలె లేచి "ఓహో! బల రాముఁడా!" యని హుంకరించి యీ పూర్వాక్షరంబుల రెంటినిఁ జెరుపవలెననియు లేక 'అ' యను నక్షరమును మున్ముందునఁ జేర్చుకొనవలెననియు నీ కాజ్ఞాపింపుమని భృకుటిరేఖలు ముడివడఁ జిరుముడి మొగమున నాతోఁ జెప్పి పంచె.

గదు—అట్లయిన నేనరిగి యామర్కటము నీ కర్కశగదా దండంబున దండించి ఖండించి వచ్చెద.

నార—అది సాధారణవృత్తచరము కాదు. ఆ పని మీ వలన నెంత మాత్రమునుగా నేరదు.

బల—ఇట్టి వీరాగ్రణుల కేరికిని శక్యముగాదని తెల్పు చుంటివి కాన నేనే యాస్థలంబున కరిగి యాకోఁతినిఁ గోఁతి పాలు గావించి వచ్చెద! ఏమియీవిపరీతము!

గీ॥ వరుస గార్దభ ధేనుక ♦ ప్రముఖదనుజ
వీరవరుల ననేకులఁ ♦ బిలుకుమార్చి
ప్రబలుఁడైనట్టి యీ బల ♦ రామునకల
కోఁతి యననెంత? దానినిఁ గూల్చుటెంత?॥

దేవా! దానిపోలిక మిప్పుడే యడఁచి వచ్చెదఁగాక. సచివాగ్రణు లారా! రండు. (అనిపోవును.)

నార—నీలాంబరా! పోవుచుంటివి కాని కడుజాగరూకతతో రణమొనర్పుము.

గదు—ఈ శూలముతో దానిని బొడిచి చంపకుందునా? (అని శూలముఁద్రిప్పును.)

నార—దాని వాలమునకు నీశూల మొక్క లెక్కయా? వెళ్లుఁడు, వెళ్లుఁడు. (అందరు వెడలుదురు.) ఇప్పటికి నామనోరథము

నగముపాలు నఫలము కానున్నది. (ఆకసమువంకఁజూచి) ఓసీ! ఖగాధమా! నీవలె గూడ దరిఁ జేరుచున్నది. చూచుకొనుము. (అని నిష్క్రమించును.)



## అష్టమరంగము, ఉద్యానవనము.

ఆంజ—(ప్రవేశించి) ఆహా! యౌవనమునుగల దొర బలరాముఁడఁట! యాదవవంశవార్ధినిశాచరుండఁట! ప్రలంబ ధేనుకాది నానా శత్రుసంహారుఁడఁట! ద్వారకాపురాధిపతియఁట! ఎవ్వఁడైన నాకేమి? అమరావతీపురంబును బురిడించెడు నా లంకాపురీ ప్రమదవనంబునే దగ్ధంబు గావించిన నాకీద్వారకయు, గిరకయు గల యీ యారామ మొక లెక్కయా? నా రాముని నొకమారు ప్రార్థించుకొంటినేని యిట్టి బలరాములును గిలరాములును మూలలఁ దాఁగికొన వలసినదే! కల్పవృక్షంబున కీవల ననేక స్వల్పవృక్షములు గల్పింప బడినట్లు లా యినవంశ రామునకుఁ బదంపడి యిట్టి ఘనవంశరాము లుద్భవింపఁబడిరి! సింహమునకు మారుపేరున గ్రామసింహము సృజియింపఁబడినట్టులు రామనామంబున నిట్టివార లలరుట యొకయద్భుతముగాదు. 'బల' యను విశేషపదమునుగూడ నితఁడు ధరించుకొని యున్నందున నాబలమెట్టిదియో పరీక్షించెద! (అని ఆలోచించి) నాచే నా తులువకడ కంపఁబడిన నారదుఁ డింకను రాకుండెను! నేనే యాతని యాస్థానంబున కరుగుదునా? వలదు వలదు. అట్టి తొందర నాకేల? ఈ ప్రమదవనంబును సంపూర్ణముగ ధ్వంసమొనరించినచో నా బలరామవీరుఁడే నాచేరువకు రాఁగలఁడు. అట్లే యొనరించెదను గాక! (అని చెట్లవంకకుఁబర్విడును)

[అంతట సుదామ బలరాములు ప్రవేశింతురు.]

బల—ఆహా! యేమీ! యీ యారామమంతయు నాశనము

గావింపఁబడినది ! ఇట్టి యకార్యమును గావించిన యా చెనఁటి యెవ్వఁడయి యుండవచ్చును?

సుదా—ఏమో! యెవ్వరెఱుంగుదురు? మన పురంబునఁగల వారెవ్వరిట్టి సాహసకృత్యముఁ గావింపరని యే నమ్మెదను, ఎవ్వఁడో యొక ముక్రిక్కడి రక్కసుఁడయి యుండనోవు.

బల— అట్టివాఁడయిన నిం దెవ్వఁడును గానరాకుండుటకుఁ గతం బేమి? లేకున్న నారదముని కుంజరుఁడు మనతోఁ జెప్పిన కోఁతియే యీ యవినీతికృత్యమును గావించియుండును!

సుదా— కోఁతి యేమి! యింతటిపని నాచరించుట యేమి? యది కానేరదు.

బల— అదిగో! ఆ భూరుహముల నడుమనుండి మనదిక్కునకే యది యేతెంచుచున్నది. ఇటురమ్ము.

సుదా— ఇది యెంత చిన్నకోఁతి! ఇది యింతపనిఁ గావింపఁ గలదా?

ఆంజ— (ప్రవేశించి) దీనికే యింత పని యని యచ్చెరు వొందుచుంటివా? ఈ మహామహీజములు నాకుఁ దృణమాత్రములని తలంపుము. మీ రాజెందు నం డాగికొని యుండెను?

బల—ఏల యింత తామసపడియెదవు? ఈద్వారకాపురాధిపుఁడను నేనే. నాపేరైన విని యెఱుక నొందైనఁ బాటుకుంటివా? (అనినుదామునివంకఁ జూచి) మర్కటమేమి? యీమాడ్కి మాటలాడుట యేమి? ఇది చాల విపరీతముగఁ దోఁచుచున్నదే!

ఆంజ—నేను మాటలాడుట నీకొక విపరీతమా? నావాలబలము నొకసారిఁ గాంచితివేని నింకను వింతఁగొనియెదవు కాఁబోలును!

బల—కోఁతికి చెట్లనుబట్టుకొని ప్రాకులాడుటకు నదృష్టము గానే యుండునుగాని మావంటి వీరుల కడ వింతఁగొలుపుటకు నిశ్చయముగాదా? నీ వీపురంబున కేలవచ్చితివి? వచ్చితివిపో నీ దారిని

నీవటుగాక యీతోఁపునెల్ల నిర్భయంగ నేల పాడుచేసితివి? తాఁకెడిన కోఁతి వనమెల్లఁ బాడుచేసెననియెడు నాయోక్తి నిశ్చయమని స్ఫుట పఱచుచు నీకిఁయ విజ్ఞప్తిగుట మావంటి నాయకుల కడఁ జెల్లునా?

చ॥ అడవులలోనఁ గొండల గు ♦ హాంతర సీమలఁ గాయ పండులన్
గుడుచుచు నీడపట్టులను ♦ కూర్మిని నిద్దుర జెందుచున్ వనిన్
మడుఁగుల నీరుఁ ద్రావుచుఁ బ్రి ♦ మాదము లేకయె యుండ నేరకీ
వసువున మాపురంబునకు ♦ వచ్చుట యేలొకో? చావుఁగోరఁగా

అంజ—చావు కొఱకా వచ్చితినని తలఁచుచుంటివి! అట్టి తలంపుల నెన్నఁడును జెందకుము. "జాతస్య మరణం ధ్రువం" బనియెడు నీతికై వడిఁ బ్రతిమానవుఁడును బుట్టుట చచ్చుటకే యని భావించు కొనుము. అట్టి మృత్యుభయమే నీకుఁ గల్గినచో నిచ్చట కేల యీగతి రా సాహసించితివి? క్షేమంబుగ నీయంతఃపుర భాగంబుననే తలుపుల మూసివైచికొని యుండకపోతివా? పెద్దపేరులఁ బెట్టుకొని నీమాడ్కి పెద్దమాటలనాడు వారలే తుదకుఁ బేరుప్రతిష్ఠలులేక యేయూరాలనో పెద్దనిద్దురఁజెందుట జగమునఁ గదు. నీ కీబలరామ నామంబెవ్వరొసంగిరి!

మ॥ ధనముం గల్గిన మేటివైన యెడ స ♦ ద్ధర్ముండవై లోకమం
దునఁ దేజంబును గాంచుచున్ సిరిఁదులన్ ♦ దూగంగ యత్నిం
(చి యుం
ద్రిని నామంబునొ చంద్రపేరునొ కుబేరుండంచునో యెట్టులై
నను బిల్వంబడ నేరకీ విధము నన్ ♦ రామాఖ్యఁబొల్పొందుదే?

ఇది నీకెంతమాత్రమును దగదు. పైపెచ్చు బలరాముఁడని కూడ జనులచేఁ బేర్కొనఁబడుచుంటివఁట! నీకెంత బలముగలదో తెలిసెం జెడఁగాక! ఇప్పుడయిన నీపేరును మార్చుకొనుము.

బల—ఓహో! నిన్నొక్క యల్పజంతువని భావించి, నేం బోరించినచోఁ బాపకారణంబని గ్రహించి యింతవఱకు మిన్నకుంటిని

గాని లేకున్నచో నీహాలమున నీహనువుల నణంచియే యుందును.

అంజ—పాపమెంత కనికరించుచుంటివి! నామాటవినుము.

బల—తుచ్ఛకపివగు నీమాటనా నేనాలించుట? యెట్లో నేరక యీపట్టణముం జేరితివి. నీనైజగుణమును వీడలేక యీవనమంతయుం బాడుసేసితివి, అల్పుండవగు నిన్నుం జంపుట నాకుం బనిగాదు. కావున నిన్ను క్షమించితిని. కావలసినచో నీయాంకలి తీరునట్టి యెట్టి ఫలంబులనయినం దెంచికొని యారగించి చనుము. నీజోలికిం బో వలదని నాభటులకుం గూడ నాజ్ఞాపించెదం బొమ్ము. సఖులారా! ఈకోంతితో మనకేమి! రండు.

అంజ—అబ్బా! నాకేవిధమైన నాల్గుఫలముల లంచమిచ్చి తప్పించుకొని పోవలెనని యత్నించుచుంటివా? అట్లు నిన్నుం గదల నీయను. శ్రీరామనామంబునకుం బ్రతినామంబును గొన్న నీవా పేరును దీసివైచికొనని చో నొక్కండయుడు గైన నిడనీయనని యే నమ్ముము.

బల—అట్లయినం జావునకు నంసిద్ధుండ వైతివా?

అంజ—ఎవ్వరు సంసిద్ధులయ్యెదరో క్షణములోం దెలియును.

బల—ఏమీ! అంతకంతకు మితిమీఱుచుంటివే! నిన్నింకం బ్రాణములతో విడువరాదు. ఇదే! చూచుకొనుము.

అంజ—(తప్పించుకొని) ఓరీ! మందా! శ్రీరామనామమును శిరసావహించిన నాకు నీవంటి తిండిపోతు రాముల హాలాయుధంబులును, బలాధికంబును గణనసేతునా? ఇంకం జూచుకొనుము. (అని బలరాముని దోంకతోం గొట్టును.) బలరాముండు నేలంబడి మూర్ఛిల్లును.

సుదా—(దూరముగాంజని) అయ్యో! యీతండు దొల్లింటి రాముని బంటగు నాంజనేయునివలెం దోంచుచుండెను!

బల—(లేచి) అక్కటా! నా ప్రాణములివ్వుడు కంఠగతము

లైనది! ఈతఁడెవ్వఁడో మహా బలశాలివలెఁ గన్పట్టుచున్నవాఁడు. సుదామా! నీవు శీఘ్రముగఁబోయి కృష్ణునిఁ దోడ్కొనిరమ్ము.

(సుదాముఁడు పరువెత్తిపోవును.)

ఆంజ—వాఁడెవ్వఁడో రానిమ్ము. చూచెదఁగాక. (అని తోఁకను గుఱుచపఱచి) ఓరీ! బలహీనా? ఇప్పుడైన నామాటఁ బాటించెదవా?

బల—చిత్తము. (అని వడఁకుచు) అట్లే చేసెదను.

ఆంజ—అట్లయిన నిప్పుడు నీపేరేమనియెదవు?

బల—నీవనినట్లే.

ఆంజ—అట్లనవలదు. 'అబలరాముఁ'డనుము.

బల—అ-బలరాముఁడే.

ఆంజ—అట్లయినఁ గూర్చుండుము.

బల—(కూర్చుండును.)

ఆంజ—నేను నారదునిచే నంపిన సందేశమును వింటివా?

బలి—వినుటవలననే నాకింతటి శిక్షయొనఁగూడినది.

ఆంజ—సరియే. నేనొక యల్ప మర్కటుండను. నాకాఁకలి యగుచున్నది. కావున నింతకు ముందు నీవు నాకొసంగఁదలఁచిన ఫలముల నిప్పుడీయుము.

బల—నీకు నేనొసఁగ నేపాటివాఁడను? ఈవనమే నీకిచ్చుచుంటిని. ఇందున్న గావలసినన్ని ఫలములఁ గొనుము. నాకు సెలవొసంగుము.

ఆంజ—బలవంతుఁడవని యూరక గర్వమొందకుము. చనుము.

బల—(వెళ్లును.)

ఆంజ—నాచే నంపఁబడిన మునినాయకుఁ డింకను రాకుండెనే! అయిననేమి! యాతఁడు వచ్చువఱకు నీచెంత ఫలాహారముఁ గావించుచుండెద. (అని నిష్క్రమించును.)

శ్రీ




తృతీయాంకము, ప్రథమరంగము.

బలరాముని మందిరము.

బలరాముఁడు, గదుఁడు, అనంతుఁడు మొదలగువారుందురు.

గదు—దేవా! నిన్నను మీ రాయుద్యానవనమునుండి యేతెంచినదాదిగ మీ ముఖారవింద మీభంగిఁ జిన్నవోయి యున్నటులే మాకెల్లరకుఁ దోఁచుచున్నది!

అన—స్వామీ! నేఁటి ప్రాతఃకాలమునుండియు దీనిఁగూర్చియే మిమ్ములఁ బ్రశ్నింపఁ దలఁచుచుంటిమి కాని మాలో నెవ్వారికేనియు నట్లడుగుటకుఁ దగిన సాహసంబు గలుగదయ్యెను!

బల—(మొగమును దించుకొని) సుదాముఁడు మీలో నేరితోడనయిన నాసంగతి నించుకయుఁ దెల్పియుండలేదా?

గదు—అతఁడు మీతోఁగూడి చనినది మొదలింతదనుక మాకేరికిని గాన్పింపనేలేదు.

బల— ఇది యేమి చిత్రము! అప్రమదవనంబున జరిగిన వృత్తాంతము నాలోచించుకొన నిప్పటికిని నాకు భీతికరముగనే యున్నది!

అన—ఆకోఁతి యంతటి యసాధారణ ప్రజ్ఞఁగలదియా?

గదు—తుదకు దాని నావల కంపివేయవచ్చిరా?

బల—లేదు. దానినిఁ గెలువ నీముల్లోకంబుల నెవ్వఁడు నసమర్థుఁడనియే నమ్మెద.

అన—వానరమున కేమి! యంతటి బాహుపటిమ యుం రుట యేమి?

గదు—ఇది చాల వింతగ నున్నదే!

బల—దానికిఁ గల పటిమము బాహుబలమే కాదు. వాల బలమనియే యెంచుఁడు, అది సామాన్య మర్కట మెంతమా త్రమునుగాదు.

చ॥ మనుజులు మాటలాడు క్రియ ♦ మాటలనాడఁ దొడంగెఁ దొల్త [వెం
టనె ననుఁ గాంచి భీకరని ♦ నాదముఁ జేసెఁ బదంపడిఁ మహా
ఘనమగు వాలమున్ బెనిచి ♦ గ్రక్కున నాతనువెల్లఁ జుట్టినే
లను బడఁగొట్టెఁ బెక్కుగతు ♦ లన్ బ్రతిమాలిన వీడ దెంతయున్॥

గదు— ఎంత పనిఁ గావించినది! అయ్యది యింక నావనము నందే యుండునా?

బల—దానిసుద్ది నింక నన్నడుగకుఁడు.

అన —అట్టులయిన మేమెల్లరమరిగి యావెకిరింత నొక్క క్షణములోఁబట్టి మీ పాదముల కడ నుంచుదుమా!

బల—ఆపని నలువుర మీ కలవి కాదనియే విశ్వసింపుఁడుఁ దానిమాట నింకఁ దలఁపకుఁడు. అద్దాని నేను తలంచినచో నామహా వాల మింకను నా శరీరమును జుట్టుకొని యున్నటులే తోఁచును. ఆ సమాచారమును మఱవుఁడు.

గదు— ఇది యంతయు కాలవిశేషముగాని వేఱొండియుఁ గానేరదు.

బల—అట్లే భావింపవలయును.

(అంతట శ్రీకృష్ణుఁడు సుదామునితోఁ బ్రవేశించును.)

గద—కృష్ణదేవా! యీ యుచితాసనంబున నధిష్ఠింపుము,

బల—అనుజా! రమ్ము. సుదాముఁడు నీతో నాకీపసమాచారమేమయినఁ దెల్పియుండెనా?

కృ—తెల్పనేమి? అందేమి విశేషముగలదు? వనములందుఁ గ్రుమ్మరుచుఁ గాయపండులు దినుచుఁ బొట్టఁ బోషించుకొనునట్టి యీ స్వల్ప మృగమేడ నీయెదుట నిల్పులేడ?

బల—సుదామా! వీనితో నావార్త యథార్థముగ వాక్రుచ్చితివా?

సుదా—దేవా! సంపూర్ణముగఁ దెల్పితిని గాని యీమహానుభావుండద్దాని నెంతమాత్రమును విశ్వసించియుండలేదు!

కృ—అన్నయ్యా! యా వెక్కిరింత మోకమునకుఁ దగిన శిక్ష నీ వొనరించినందులకు నే నెంతయు సంతసించుచుంటిని. పాపము! దానినిఁ జంపివేయక ప్రాణంబులతో విడిచియే వచ్చితివికదా! అంతియే చాలును.

బల—నీకీ యకృతవార్త నెవ్వరు దెలిపిరి? లేదే! అదియే నన్నుఁ బ్రాణములతో విడిచిపుచ్చినది. నిన్నాసమయంబున నాసమరరంగంబునకు రమ్మని యీమన సుదామునిచే వర్తమానమంపినను రాకుంటచే నట్లయినది. ఏమని తెల్పుదును!

కృ—ఏమట్లనుచుంటివి? ఆ తుచ్ఛమర్కటమును నీవంతకు మున్నె సంహరించి యుందువని నేనెంచి నిన్నఁగతి సంతోషకరంబుగ హెచ్చరించుటకు వచ్చియుంటిని గాని నీవు చాటురీతి సంఘటిల్లునని కలనైన నెఱుఁగనైతిని. ఎంతపనియయినది! నేను సమయంబునకు రామిచే నాక్రియ జరిగెననుచుంటివా! అదియెట్లు? ప్రలంబధేనుకగార్దభప్రముఖదానవులఁ బరిమార్చిన మహాబలవంతుఁడవగు నీకే

యయ్యది యసాధ్యమయినచో నీకన్నఁ జిన్నవాఁడనగు నాకిఁక శక్యమగునా?

బల— లేదు. లేదు. నీచక్రధారతో దానివక్రపాల మెందులకును బనికిరాదనియే భావించెదను.

కృ— ఏది యెట్లయినను ఘాతుకమృగములతో మనవంటి వారికిఁ బోరాటములేగదు. ఇప్పుడయిన నేమి? అతిమ్మఁడీ ద్వారక నింతలో నీడిగంభీర వారాశిందాఁటిపోఁగలఁడని మదినెంచుచుంటివా? అదివట్టికల్ల. దానిసంగతి మున్ముందు మనలకు స్పష్టముగఁ దెలియఁగలదు. అప్పుడే వానికి నుచితపారితోషిక మొసఁగఁజను సమయము సంప్రాప్తమగును.

బల— అయ్యది మన పురమున కెట్లువచ్చినదో కూడనాకుఁ దెలియకున్నది!

కృ— అవునవును. మున్నీటి పెన్నీటిఁ దాఁటి ద్వీపంబుఁ బ్రవేశించి, యుద్యానారామమును పాడునలిపి, వీరులఁ జంపి, పుర మితేనిఁగూడఁ బరాభవించినయామల్లు గాలినుండి యుట్టిపడినట్లు తోఁచుచున్నది. అది కేవల కపియయ్యు నిజపరాక్రమంబునఁ గేసరికిశోరమువలెనే పొడసూపుచున్నదే! కానిమ్ము.

బల— సోదరా! కృష్ణా! తొల్లి నేనుగోపోద్రేకుఁడనయి నీము డనుచ్చరించిన పరుషాలాపంబుల నీవు చిత్తమునఁ బరిగణింపక యుచ్చ్యటకు నీయిచ్చవచ్చిన రీతిని స్వేచ్ఛగ వచ్చుచునేయుండుము. ఆ కోఁతిని గోతిపాలు సేయునంతవఱకు నాకు నిద్దుర పట్టదనియే యెంచుము.

కృ— వంట యింటి కుందేలది యెక్కడికేఁగఁగలదు?

బల— కాదు. అయ్యది నాయొంట నంటుకొను తేలుకాని వేలుకాదు.

(అంతట నారదుఁడు ప్రవేశించి)

నార—ఇది యెంతయు మొట్టలో మొట్టవలెనున్నది!

బల—(లేచి) మునిచంద్రమా! యిందున దయసేయుము.

నార— (కూర్చుండును )

కృ—మునికులోత్తమా ! మననగరమున కరుదెంచినదని నీవు తెల్పియున్న యాకోఁతి రీతి నెఱింగితివా?

నార—ఎఱుంగకేమి? అయ్యయ్యా! అది కొంపలఁ గాల్చిన కోఁతియేగాని కోఁతి యెంతమాత్రమును గాదు. (అని బలరాముని వంకఁజూచి) బలరామదేవా! అది సాధారణప్లవంగముకాదని నీతో మున్నే తెల్పియుంటినిగదా! దానితో నీవేల యింతవనుక సంగ్రామ మొనరించితివి? నీరయాదవ వీరులలో నేరినైనఁబంపక నీవేల యుట్టిపనిఁ గావింపఁ గడఁగితివి?

కృ—గతించిన పనికై వగవనేల? దానిఁగూర్చి యాలోచింతము. రండు.

నార— అవును. నిజవవలదు. ఆచెనఁటిని ముక్కుఁబట్టి నేలరాఁచి తుదకు దిక్కుమాలిన పక్షిని గావించి, ఱెక్కల విఱుగఁ గొట్టి తోఁకఁద్రెంపి యణఁచవలయును. రండు.

కృ—అన్నయ్యా! ఇంక నే నాచరింపవలసిన పని యున్నచో నాకు సెలవొసంగుము.

బల— తమ్ముఁడా! నీకు జయమగుఁగాక ! నారదసంయమీంద్రా! నీకోరిక సిద్ధించునుగాక !

కృ—తాపసవర్యా! రమ్ము.

(అని నారదునితో నిష్క్రమించును.)

బల—అమాత్యవరులార! మన యంతఃపురోపరిభాగంబున కరిగి యాకోఁతిమూకమెకము గావించు చేష్టల నాకయుదము రండు.

(అనిలేచి అందరితో నిష్క్రమించును.)

## ద్వితీయరంగము, కృష్ణుని భవనము.

(శ్రీకృష్ణుఁడు నారదుఁడు నుందురు.)

కృ—సందియమేలదా! నే నెంత తలంచి యుంటినో యంత యుం గొనసాగినది! ఆమారుతి ప్రభావ మఱచియుంటివికదా!

నార—ఆహా! ఆతని ప్రభావము నేనెఱుఁగని దెంతమాత్రమును గాదు. కాని వాని కాలమున్నాఁటి బలపరాక్రమంబు లింకను దన శరీరమున నలరి యున్నవా యని మాత్రము శంకించియుంటిని.

కృ—అట్లూహింపవలదు. చందనభూజంబునకు వృద్ధియగుచున్నకొలఁదిని సుగంధము హెచ్చుచునే యుండును. ముదురుచున్నకొలఁదని చేవ యధికమగుచునే యుండును. ఆమార్గముననే యా వృక్షచరమునకుఁ గాలము మీఱుచున్న కొలందిని శరీరపటిమ యినుమడించుచునే యుండునని తెలిసికొనుము.

నార—ఆశాఖామృగకుంజరునట వీడి వచ్చితిని. బలరాముని దరినుండి చయ్యన నత్తావున కరుగకుంటిని. అందువలన నాతఁడు నా కేయొగ్గు నొనరింప నెంచునో! నా కొఱకాతఁ డావనంబున నెంతతడవు వేచికొని యుండునో? ఇంక నే నరిగి యామహాప్రజ్ఞావంతుని నీ చెంతకుఁ దోడ్కొని వచ్చెదను. నా కానతిమ్ము.

కృ—ఆతఁడిచ్చటకు రానొల్లఁడనియే నమ్మెదము. ఒకవేళ అట్లొనరించినచోఁ బ్రమాదము వాటిల్లును. శ్రీరాముని దక్క నన్యునేరి నాతఁడు సరకుసేయఁడని మున్నె నీతోఁ జెప్పియుంటిని కదా! అప్పుడే మఱచితివా?

క॥ హరిమీఁదన్ గిరిపడినను
గిరిపై హరిపడినఁ గాని ♦ గిరగిర ఘరమే
తిరిగినఁగాని సుత్రెవ్వఁబ
సరకుఁగొనం డౌర! రామ ♦ చంద్రుని తప్పన్

నార—అట్లయినచో నిప్పు డేమి కావింపనగును?

కృ—సత్యభామాతిశయభంగముఁ గూర్చి యించు కాలోచింతము.

నార—నే నిన్న కష్టంబులకోర్చి యసాధ్యుండగువాని నీ మూలకుఁ దోడ్తెచ్చి నందులకుఁ దుదకు నావనినే తుదఁ బెట్ట నెంచ దవా? కృష్ణా! ఆమె యొక యబల! ఆయబలాగర్వమును భంజింప నీవంటి వాని కొక్క నిమేషమయినఁ బట్టఁజాలదు. ఆఖగాధముని మఱచి యుంటివి కాఁబోలును! ఆ నిష్ఫలప్రల్లదుని, బల్లిదునిమాటఁ దలంచుకొనిన నాయొడలున మంటలు జనించి భుగభుగఁ బొగలెగయుచున్నవి. వానికి ముందుగ గర్వోన్మూలనంబుఁ గావింపవగును.

కృ—సరియే! యాతనిపైఁగల కోపము నాపయిని జూపకుము. వానినిదె రప్పించెదను. (అని ఆకసమువంకఁ జూచి)

పంచచామరము.

తటాలునన్ నినుం గనంగఁ ♦ దల్చెదన్ గడున్ వడిన్
దిటంబు మీఱ నేఁడు నీదు ♦ దీర్ఘ పక్ష విక్రమం
బిటన్ దెలంగఁ జూపనెంచు ♦ మించుకైనఁ గొంచకే
పటుత్వమార నాదు మ్రోల ♦ వ్రాలు పన్నగారి నా!

నార—సెబాసు! కృష్ణా! అదిగో! యాఖగాధముని ఱెక్కల ఘోరవము వినవచ్చుచున్నది! నేనిచ్చటనుండి తొలఁగుదునా?

కృ—వలదు వలదు. నీ కన్నుల యెదుటనే వానికిఁదగు పరాభవము చేకూరు నట్లొనర్చెద. కాంచుచుండుము.

(అంతట గరుత్మంతుఁడు వ్రాలును.)

గరు—దేవా! నీయాజ్ఞ శిరసావహించి, నీచరణకమలంబుల భజియింప నరుదెంచిన నీదాసుని వందనంబుల స్వీకరింపుము.

(అని మ్రొక్కును.)

నార—(కాలుపైఁగాలుంచుకొని) పెడమొగమ్ముఁ బెట్టుకొని

కూర్చుండును.)

కృ—ఏమి! యింత యలసి సొలసి వచ్చితివి?

గరు—వాసుదేవా! నీయానతి యట్లులేదు గాన, జయ్యన నీ సాన్నిధ్యమున కీగతి నేతెంచియుంటిని. నీ చెంతనున్న వానికి నట్టి బడలికయును గలుగునా?

నార—(మెల్లగా) ఏమి యిచ్చకంబులు!

గరు—స్వామీ! యీ కయ్యముల కాకాచి యిచ్చట కెవ్వండు దాపరించెను?

కృ—ఆతని ప్రసక్తి నీకెందులకు? నీవచ్చినపని నాచరించు కొనుము. ఈతఁడు కయ్యములకు నాటపట్టని యెఱింగియు నకారణంబుగ వీనితో నేల వాదులాడఁబ్రయత్నించెదవు? నామాట నాలకింపుము.

గరు—దేవా! ప్రసాదింపుము.

కృ—నీ విప్పుడొక ఘనకార్యమును గావించి యీద్వారకాపురమున కెల్ల మహోపకారముఁ గావింపవలయును.

ఉ॥ ఎక్కడి కోఁతియో యొకటి ♦ యెంచక కొంచక వీటఁ జేరి సొం
పెక్కిన పూలతోఁటల రి ♦ హిం దనరారెడు పల్లవంబులన్
బెక్కులఁ బాడుసేసి యదు ♦ వీరులఁ గొందఱఁ జంపి రాముని
జిక్కులఁ బెట్టినొంచెనఁట ♦ చిత్రముగాదె! యిదెట్టిమాయయో!

గరు— కోఁతియా! యంతటి సాహస కృత్యముఁ గావించుట!

నార— అ-వు-ను.

గరు— విన్నదుగలేదు. (అని కృష్ణునివంకఁ జూచి) అట్లయిన దానినిఁబట్టి తెచ్చి నీ పాదములకడ నుంచవలయునా?

కృ— (తలనూఁచి) అవును. అదియే నాకోరిక.

గరు— ఇది యెంతపని! విషముఁగ్రక్కుచున్న మహోసర్పంబులఁ బట్టినరీతి నా తుచ్ఛమర్కటకాలతతు నాహారములనొసంగి

మించియుంచితిగదా దానినొంచి నీకడకుఁ దెచ్చి విడిచెద. సెలవొసంగెదవా!

కృ— పొమ్ము దాని తోఁకఁబట్టి యీడ్చుకొని రమ్ము. అల్ప జంతువుగానఁ దొల్లి నే వైరంబు సలుపక నేను విడుచుచుంటినని తోడ్కొనిరమ్ము. పొమ్ము.

గరు— చిటికలో వచ్చెదను. ( అని నిష్క్రమించును )

నార— వెళ్లుము. వెళ్లుము, విసపుఁదిత్తులఁగసకస నమలి మ్రింగిన నీ కంఠమునఁగల పసరుఁబులుసులింక గారును.

కృ— అన్నా! నారదా! నీవు మిన్నకుండవు గదా!

నార— ఎట్లుమిన్నకుండుదును? వానినారసినచోఁ గటుక్కునఁ గొంతికి వేయు వలె నన్నంతటి యాగ్రహము నాకువచ్చుచున్నది.

కృ— సరియే. ఆ యాంజనేయ వైనతేయుల పోరాటమును మనమీ దుర్గ ద్వార గోపురాగ్రభాగమునుండి తిలకింతము రమ్ము.

నార— అవును. అచ్చటనుండియే వారిపోరాటము బాగుగా గోచరమగును!

కృ— సరియే. రమ్ము. రమ్ము.

( అనియిద్దరు నిష్క్రమింతురు.)

## తృతీయరంగము. ఉద్యానవనము.

ఆంజ— ఆహా! కన్నులార నాకు శ్రీరామదర్శనంబు చేకూరు నని యెడు మహోత్సాహముతో నింత దవ్వు నారదునితో నరుదెంచితినే కాని యట్లు చేకూరక పోవుటయే కాక పనికిమాలిన వరులతో నకారణంబుగ నాలము గూడఁ జేకూడుచున్నది. చాలఁ బడవయ్యె నా యతికులోత్తముని జాడ తెలియకున్నది. కానిమ్ము. రామా! రఘుకులసార్వభౌమా! యిన్నినాళులనుండి నిన్నే మదినమ్ము కొనుచు నీ చరణారవింద[illegible]ని మనంబున ధ్యానించు చున్నాను,

నీవేల యీనాఁటికైన నీతొల్లిఁటి రూపమున నాకెదుట సాక్షాత్క-
రింపవు? హా! సీతమ్మా! నీవయిన నీభృత్యుని మొఱనాలించి నీధవుని
మానసంబును నావంకకు మరలునట్లొనర్పఁజాలవా?

సీ. అతిభీతుఁగాని వేద ♦ పతివాచు నేదేవుఁ
బెండ్లాడఁ దపముఁ గా ♦ వించితమ్మ!
పద్మంబున జనించి ♦ బహుకష్టముల నందు
నేపుణ్యువరియింప ♦ నిలిచితమ్మ
పేటికనిమిడి, కృ ♦ పీటరాశినిఁ దేలి
యేమూర్తి కొఱకంత ♦ యీఁదితమ్మ!
భూగర్భమునఁ గడు ♦ బోగిలిచాలఁ గృశించి
యేపతి కైతపి ♦ యించితమ్మ!
గీ. అట్టి సుగుణాభిరాము, సూ ♦ ర్యాన్వయాబ్ధి
సోము, కారుణ్యధాము, శ్రీ ♦ రామువనకుఁ
దిప్పి పంపఁగదమ్మ! నా ♦ దిక్కునకును,
తల్లి! సీతమ్మ! భృత్యునిఁ ♦ దలఁపవమ్మ!

( అనికన్నులుమూసి ) ఆహా! సీతారాములారా! నా వందనంబుల గొనుఁడు. ( సీతారాములుకన్నెదుటఁగన్పడుదురు. ) ఓదయామయా యేమనుచుంటివి? రుక్మిణీ వాసుదేవుల ముమ్మూర్తులఁగా భావింపుమని తెల్పుచుంటివా! ( సీతారాము లదృశ్యులగుదురు. ) ఇంత లోనే యంతర్ధానమందవయితివా! ( అనినాల్గువంకలఁజూచి ) ఔరా! యీశిరమహాత్మ్యమేమందును! అయినను నా మానసము చక్కఁబడ కున్నయది, ( అంతట గొప్ప చప్పుడువినఁబడును, గరుత్మంతుఁ డాకసమునుండి నేలవ్రాలును. )

అంజ— ఏమీ! యీ విపరీతమానవుఁ డెవ్వఁడైయుండును ( అని గరుడునివైపునఁజూచి ) యీదీర్ఘఘోరనేత్రియునిఁ జూడ నాకబ్బురమగుచున్నది! అయ్యా! నీవెవ్వండవు?

గరు— ఓహో! యిది కూరలఁబట్టిన కోఁతివలెఁ గన్పట్టు చున్నదే! (అని ఆంజనేయునివంకఁ జూచి) నీవేకదా! యీవనము ను బాడుసేసి బలరామునిఁగూడ శిక్షించి యుంటివఁట.

ఆంజ— ఏమీ! బలరాముననా? అబలరామునా?

గరు— వానరుండవయ్యు వట్టి మాటల నాడ నేర్చితివా?

ఆంజ— వట్టి మాటలే కాదు. గట్టిమాటలఁ గూడ నాడ గలవాఁడననియే నమ్ముము.

గరు— పాటలఁ గూడఁ బాడగలవా?

ఆంజ— నీ వచ్చిన పాటయుంగాక పాటలఁగూడ నాలకింప నెంచెదవా?

గరు— నీ పొగరు మాటల కేమి కాని యెవ్వని యనుజ్ఞ నొంది సీవీపురమును జేరితివి?

ఆంజ— అది యంతయు నీ కెందుకు? నీదారిని నీవుపొమ్ము.

గరు— నాదారి వరిగియే యీగమ్యస్థానముఁ జేరితిని.

ఆంజ— అట్లయినఁ బాడువడిన వనములా నీకు గమ్య స్థానములు?

గరు— ఏ తావులకుఁ గార్యసాఫల్యమున కరుగుదుమో యానేమలే తమకు గమ్యస్థానములుగానేరవా?

ఆంజ— సీపిప్రదేశము నే పనిఁ బూని ప్రవేశించితివి?

గరు— నిన్నుఁ గైకొనిపోవుటకు.

గరు— ఎచ్చటకు?

గరు— నా యిచ్చవచ్చిన చోటునకు.

ఆంజ— నా యిష్టములేకయే నన్నుఁదోడ్కొని పోవనెంచ ద్దవా?

గరు— ఎద్దుపడి కూ గంటఁగట్టుట? కృష్ణుని యుత్తరువయి న పదంపడిన నావంటివారుఁడిట్టిపనిఁ గావింపఁ గడఁగిన యనంతరమున

ను నీవంటి యల్పుని యిష్టాయిష్టములు సాగునని భావించుచుంటివా!

ఆంజ— ఆమాట విడువుము. నీ పెట్టె దిట్టతనమయినను నీ గుట్టువిడి రట్టు పాలు గాకుము. ఈ దినమున వేకువనే నిద్రనుండి లేవఁగనే యేరి ముఖమునుజూచి వచ్చియుంటివో జ్ఞప్తికిఁ దెచ్చుకొని మఱలిపొమ్ము. పాపము బలరాముఁడు మానవేంద్రుఁడుగాన వానికెవ్వరైనఁ దోడరుగుదెంచి యుండిరి. నీవొకదిక్కుమాలిన పక్షివికాన నక్కురమాలిన యక్కిరి బిక్కిరి పలుకఁగ్రిక్కున నే దిక్కునకైన నగసిపొమ్ము.

గరు— నేనుదిక్కుమాలిన పక్షినైన నీవు దిక్కులేని వనచరుండవుకావా!

ఆంజ— అవును. మా వనచరంబుల సన్నాడి నాలకింపఁగనే సకలశకుంతలములును గులాయంబుల సైతము వీడి పాఱునని నీవెఱింగియు నింత మూఢమతమున నాయెదుట నిల్వసాంచెదవా?

గరు— ఇంకే నీ బీరములఁ గట్టిపెట్టి తిన్నగా రమ్ము. లేని యెడ నాఘోరపక్షబలమున నిన్నెగురవైచి కాళ్లఁదన్నుకొనిపోయెదనని యెఱుంగుము.

ఆంజ— నీకిటీవలఁ బలుకులతో నుత్తరమొసంగుట యనవసరము. నీకెవ్వరింక దిక్కయ్యెదరో పరికించెదఁ గాక.

( అనితోఁకతోఁ గొట్టును.)

గరు— ( తప్పించుకొని ) నీతోఁకచేఁ బడుటకే వైనతేయుఁడు రౌహిణేయుఁడు గాఁడు. నీపనిసరి. చూచుకొనుము.

( అని ఱెక్కలతో విసరును )

ఆంజ— ఓసీ! తులువా! నీ ఱెక్కల నాడించినంతమాత్రమున బెదరువాఁడనని యెంచుచుంటివా? తాఁటియాకుల చప్పుడులకు బోలు నీధ్వానంబునకు జడిసి పాఱుటకునీతఁడు కుందేలు గాఁడని నమ్ముము.

గరు— అట్లయిననింకఁ గాచుకొనుము.

( మఱియొకసారి తొక్కులనాడించును )

ఆంజ— ఇంతేకదా నీపరాక్రమము? ఇఁకనైన నీ వచ్చినత్రోవను బొమ్ము.

గరు— నిన్ను వంచించి పట్టిపోవలయునని వచ్చినవాఁడ నూరకచనువాఁడనుగానని తెలిసికొనుము.

ఆంజ— చావునకయిన సాహసించెదవుకాని నాహితవచనంబుల నాలింపవా?

గరు— ఓహో! హితవచనంబులా! చేఁతగాని వానికి హితవచనములే ప్రాణములరక్షించునని యెంచి యీరీతిఁ బల్కు-చుంటివా?

గీ. మంచిమాటలనఁ బ్రీతి మూలుకొనినఁ
గాళ్లమీఁదను బడినను గాని నిన్ను
విడిచిపుచ్చువాఁడనుగాను వినుము; తోఁకఁ
బట్టి, నేలనఁగొట్టి, గ ర్వంబడంతు

ఆంజ— ఓహో! మితిమీఱుచున్న నిన్ను మున్నుపాలు గావింపవగును. ( అనితోఁకతోఁగట్టిగాఁగొట్టును )

గరు— విడువుము. విడువుము.

ఆంజ— "తోఁకతోఁ బట్టి నిన్ను వధింతు"నంటివిగావఁ దోఁక నొవంగియే యుంటిని!

గరు— వదలుము. నీపటిమ నెఱుఁగక నిన్నొక యల్పకపివలెనెంచి యీరీతి పరుషాలాపంబుల నుచ్చరించి యీవిపత్తుఁ దెచ్చికొంటిని. మన్నించి నన్నుఁ గాపాడుము. శ్రీకృష్ణుండు నన్నుఁ దోడ్కొనిరమ్మని నన్నుఁ బంపుటచే నీయొద్దకీ భంగి వచ్చితిని గాని లేకున్న నేను నీదిక్కునకే రాకుందును. నన్నింకనైన విడిచిపుచ్చుము. పోయి యీసుద్దియంతయు నేను దేవునితోఁ జెప్పి నా

వారి నే నరిగెదను.

అంజ— కృష్ణుడనిన జ్ఞాతే మున్ను జడినవాని సోదరుడే కాదా?

గరు— అవును. ఆబలరాముని సోద-

అంజ— ఆ! ఏమి! బల రాముననియా యనుచుంటివి?

గరు— కాదు. కాదు. అబలరాముని సోదరుడే.

అంజ— వాసుదేవుడని మతియొక నామమును బేర్కొం టివే! ( అని ఆలోచించును )

గరు— అవును. అయ్యది యు నాకృష్ణుని నామమే!

అంజ— అట్లయిన వానిం గూడ నాపైకిఁ బంపెదవా యేమి?

గరు— ఏమో! యాతఁడు వచ్చినను రాకున్నను నాకేమి? నే నింక నా రుక్మిణీ మనోహరుని మాటల నాలింపను.

అంజ— ఏమీ! ఆతఁడు రుక్మిణీ మనోహరుఁడా! వాసుదేవుఁ డా! ( అని ఆలోచించి ) అట్లయినఁ జనుము. ఒకవేళ నన్గూర్చి యాతఁడు విశ్వసింపని యెడల నీ చరణంబుల వంటి పట్టియుండు నీ వాలాగ్రమును వానికిఁ జూప వలెనుము. అంత దనుక దీని నట్లే యుంచెదను. పొమ్ము.

గరు— తుద కెంతయయినది! అకృష్ణుని పరిక్కను గూరు చూడి నావైపునఁ గోపవీక్షణంబులఁ జూచుచుండిన యా తుచ్ఛనార దుఁడే దీనికంతయును గారణభూతుఁడయి యుండనోపు. అబ్బా! నారదా! ఇదినీ దెబ్బయే! కానిమ్ము. జ్ఞాపకముంచుకొనుము. వాని ననవలసిన దేమున్నది! తొల్లి వైకుంఠమ్మున సేనాతనియెడ నిర్లక్ష్య భావంబున జూపిన గర్వాతిరేకపు ఫలమియ్యది! గతించినదానికే మింకాని ప్రస్తుతమీ తోఁక దప్పదయ్యెనే! ( అని నిష్క్రమించును )

అంజ— ఈతని వచనంబుల నెంచినచో తృణమాత్రము

న్ను నాకొట్టదుటఁ బ్రసన్నుఁడయిన రాముని వాక్యార్థము స్ఫురించు చున్నదే! రుక్మిణీ వాసుదేవులఁదార్థుగా భావింప వలయుననిక దా వింటిని! వీరి దర్శనంబయినఁ జేకూరినచో నేనుధన్యుండనే! హా! శ్రీ రామా! రఘువంశసోమా! నీదాసునిపైఁ గరుణింపుము.

( అని వృక్షములచాటున కేగును. )

చతుర్థరంగము శ్రీకృష్ణునిభవనము.

( శ్రీకృష్ణుడు నారదుఁడు కూర్చుందురు. )

కృ— మునీంద్రా! నీమనోరథమిప్పటికైన నెఱవేఱినదా?

నార— ఎట్లు నెఱవేఱినది? ఆ గరుడుఁడు హనుమంతునిచే నోడి పరాభవింపఁబడినప్పుడుగదా నాకోరికతీరుట!

కృ— అట్లెన్నఁడును దలఁపవలదు. ఆంజనేయుఁడెల్లవిధం బుల నిరుపమానుఁడు.

సీ. పురుటిరోజుల, దేహ ♦ మునఁ దడి యారక
మునె రాహువుగ్రామిఁగి ♦ పుక్కిలించె!
కన్నెత్తిచూడ శ ♦ క్యముగాని యుల సహ
స్రాంశుదరికి విద్య ♦ లభ్యసించె!
చలియించు గిరిరీతి ♦ నలరారు నభ్రమా
తంగిమదంబు న ♦ డంగఁజేసె!
సకలవనౌషధ ♦ చయ నిధానంబగు
సంజీవి కుధరమ్ము ♦ సంగ్రహించె!

గీ. నట్టి దుర్వార బలసాహ ♦ సాదిసుగుణ
ఖనికి, శ్రీరామ భక్తాగ్రి ♦ గణ్యునకిని
నిట్టి వారెందరేనియు ♦ నేమి లెక్క?
పిడుగు బొబ్బకుసాటిరే ♦ పిల్లికూఁతల?

నార— సరియే. యీతఁడరుదెంచినచో యథార్థము బయలుపడు నను గదా!

కృ— ( దూరముగఁజూచి ) అదిగో! ఆతఁడు వచ్చుచున్నట్లేయున్నది.

నార— అవునవును. పాపము! చాల శ్రమ్మఁజెంది వచ్చుచున్నట్టులా దీనవదనమే తెల్పుచున్నది. నేనిచ్చట నుండవచ్చునా? వెడలుదునా?

కృ— నీకేమియు శంకవలదు. ఇంచుక తాళుము.

( గరుడుఁడు ప్రవేశించును. )

గరు— ( చేతుల జోడించి ) దేవా! రక్షింపుము.

కృ—యేల యింత తత్తరపాటున నధైర్యమును జెంది వచ్చుచుంటివి?

గరు— తెల్పుటకు నా నోరాడకున్నది. ఆ వానరునితోఁ జాలవడకఁ బోరి తుదకొడి జీవముతోఁ దేలి వచ్చితిని. అతఁడింకను నన్ను విడచి పుచ్చుట లేదు. నీవు నమ్మనిచో నా పాదంబునఁ జుట్టి యుంచఁబడిన యీ వాలమును దిలకింపుము.

కృ— ఎన్నఁడు నిట్టి యపజయమెఱుఁగని నీకు నేఁడిట్లగుటకుఁ గారణ మూహించితివా?

గరు— ఊహింపనేల? కల్పతరువు దరి గచ్చచెట్టే యీ నీడనాశించు వారల బాధించునుగదా!

కృ— అట్టియెడ వంగి తప్పించుకొని జాగరూకతతో మెలఁగిన నట్టిబాధకల్గునా? ఇంకను నీ బేలతనము మానవేల?

నార— బేలతనమా?

కృ— ( నారదుని వారించి, గరుత్మంతునితో ) నీ విట్టివల నైన నీ బేలతనము వీడి సంయమీంద్రుల సత్కరించుటకే ప్రయత్నించుము. కాని వారికి వ్యతిరేక మార్గముల సంచరింపకుము.

మునులు, బ్రాహ్మణులు, గోవులుఁ బవిత్రంబులని యెఱుఁగవా? ఆ యా నిర్మలమానసములు నా కు నెలవులు. వాని హింసించినను దూలనాడినను ధృణీకరించినను నన్నే యట్లు చేయుట యని భావించుము.

గరు— దేవా! క్షమింపుము. (అని నారదునితో) ముని చంద్రమా! క్షమింపుము. నీయొద్ద నాకుఁగల చనవుచే నాఁడు నీతో నట్లు భాషించితిని. ఆ మాటల నింకఁ బాటింపకుము.

(అని నారదుని చేయిఁబట్టుకొనును.)

నార— దీని కేమి? కాలవిశేషము వలన నిట్టివి సంభవించును.

కృ— (లేచి) నారద వైనతేయులారా! గతించిన సమాచారముల మఱచిపొండు. తార్క్ష్యా! నీవింక వైకుంఠంబున కరుగుము. నారదా! ఆహనుమంతు నచ్చట నూరక విడుచుట మనకుఁ దగదు. నేనింక శ్రీరామ రూపంబును దాల్చి వానిమనోభీప్సితముఁ దీర్ప వలయును. సీతారామదర్శనార్థము రమ్మని నీవువానితోఁ దెల్పి వానిని, ద్రోణాచలపు సత్వరముగ నిచ్చటకురమ్ము. సత్యభామనుమఱచెదవేమో!

నార— లేదు (అని నిష్క్రమించును)

గరు—నన్నంపుట మహాప్రసాదము. కాని యీవాలమునుండితప్పించుకొను టెట్లు?

కృ— (వాలమునుదాఁకి) ఇదియెంతపని! (ఆకసము వంకఁజూచి) భక్తాగ్రగణ్యుఁడవగు నోపావనీ! నాఁడులంకాపురంబున నీవు మేఘనాథునకుఁబట్టువడి యేను గడియల లో నధిక యోజన దీర్ఘంబుగ నీవాలంబును బెంచిన నీ మహామహిమను స్మరించి తిని. తుదకు నీవే ప్రభావంబున నాతోఁకను గుఱుచ పఱుప నేర్చితి వో యా మహిమనే మఱుక నిచ్చటఁ జూపి వీనినివిడిచి, నాకానంద మును[illegible]గఁ జేయుము.

సీ. లంకాపురీ వన • లావణ్యమునునున్న
చెక్కిమట్టాడిన • యుక్కుతోఁక!
కలఁచి దిక్కుల ధూళిఁ • గప్పి తివ్వన లేచి
యతనులిఁ బరిమార్చి • నట్టితోఁక!
అల రావణేశు సిం • హాసనమును మీఱి
యౌన్నత్యమును గన్న • యట్టి తోఁక!
సకల నిశాచర • సదన గోపురముల
దగ్ధ మొనర్చిన • దండి తోఁక!
గీ. ఎఱుఁగుదును నీపరిభావంబు, • నిన్నినాళ్లు
విశ్రమించియుఁ దొల్లిఁటి • బీరమెల్లఁ
జెక్కుచెదరక నిల్పితి • వక్కజముగ!
మేలు! నీనిసి విజృమింక! • మెచ్చినాఁడ!

(తోఁక విడుచును. గరుత్మంతుఁడు నిష్క్రమించును.)

కృ— ఈనారదముని మనోరథము నేఁడు చెల్లినది. బాగు!
—సత్యభామా! ఇంకనీవు స్వస్థముగా నుండుము.
(అని నిష్క్రమించును.)

పంచమరంగము ఉద్యానవనము.

ఆంజనేయుఁడు గూర్చుండును.

అంజ— ఆహా! సీతారాములారా! మీరునాకు క్షణముక్రిందట సాక్షాత్కరించి పల్కినవచనంబులఁ దలంచుకొనిన నాకపరిమితాహ్లాదము చేకూరుచున్నది. దశరథరామా! నీవు తొల్లిదండకారణ్యమున లక్ష్మణసమేతుఁడవై జానకిని గోల్పోయిన చింతమానవమునఁ గలవాఁడవయ్యు నవ్వుమొగమున మాసుగ్రీవునిఁ గలిసికొన్న తరుణంబునఁ గదా నీపరిభమదర్శనంబు లభించినది ఆపుణ్యదిన మెట్టిదియో, యానమయమెట్టి పరిభావముకలదోకాని, నాఁటంగోతె

నీపాదపద్మములపై నామనస్సు నిలిచి నిలిచి తుదకు నీ దివ్యచరణముల
ముపటుకు నీయనాసనశరీరమును వీడక యే నిలుకడం జెందినది. అప్పు
డు నీతోడంగూడ నన్నుంగైకొని పోవలయునని యెంతప్రార్థించిన
ను వలదని వారించి నన్నీ మాయాజగంబున డించి పైచి నీవరిగియుంటి
వి! శ్రీలక్ష్మీ స్వరూపిణియగు సీతమ్మ గావించిన భూగర్భప్రవేశము వ
లననే కదా నీకును నాకును శాశ్వతవియోగము సంభవించినది.
లేకున్నచో నీనీడయైనం జరింపకుందునా? నీకు శాశ్వతదాసుండనుగా
నా? నీముద్రికను మున్ను నేనుగొని లంకాపురీ యశోకవనమునను న్న
యాజానకింగుటచే నాతామాత ప్రసాదించిన వరమునకు బద్ధుండనై
నీవెంటనంటి యుండంజాలనయితింగదా! ఈచిరంజీవత్వము నాకేల
దాపరించినది? నామానసనేత్రముకు నీవెంత గన్పడినను బ్రత్యక్ష
మున గోచరింపకుండుటచే నాచిత్తము కడు తల్లడిల్లుచున్నది! నీవు మా
సుగ్రీవాది వానరుల నయోధ్యనుండి వీడుకొల్పినపుడు నాకొసంగిన
యీ వైడూర్యహారముతోడనే నేనింకం బరితృప్తుండను గావలయును
గాంబోలును! ( అని నిట్టూర్పు విడిచి ) శ్రీరామా! మహాకారుణ్యాసీ
మా! కాకుత్స్థరఘువంశ రత్నాకరసంపూర్ణసోమ! నీచరిత్రంబును బఠింప
నివాసరము కల్మషఘనాసరము. నిన్ను వినుతింపనిక్షణము సవారితక్షణ
ము. నిన్ను స్మరణయొనర్పని ఘటికా విషాపూర్ణ గుటిక. నాయంతరంగ
మునన్నెప్పుడునుందుననికదా వరమొసంగి నన్ను వీడ్కొల్పితివి! అట్లే
యుంటివి. ఉన్నావు. ఉందువు. ( అని కన్నులుమూసికొని ధ్యాన
ము సేయుచు వెనుకకుం దిరిగిచూచి ) ఏమిది! హా వాలమున కెవ్వా
రిట్లో మంగళహస్తము దగిలినట్లు తోంచుచున్నది! అగరుత్తంతుని
శరీరమునకుం జుట్టిన వలరూపాకారమును విడి యింతకు ముచగా విధి మా
ర్పులకు వింతలోం గారణమేమి? నాచేంబడిన యీ పుత్రాధిపుండు నన్ను
వంచించుటకై యొనర్చిన మాయాకల్పిత కృత్యమా యిది? లేక
వాలిపాదుండని నేవినిన యాకృష్ణుని యాపక్షిణీమనోహరుని ధ్యా
నానుదేవుని ( అని ఆలోచించి ప్రకాశముగా ) అయ్యో! పొరపాటు
పడితిని! వాసుదేవుని రూపమునవలరు శ్రీరాముని మహాత్మ్యమా!

లేకున్న నాపరిభావమిట్లు శ్లాఘ్యతకెక్కి యుండ కెవ్వరికీమహద్భాగ్యంబు లెట్లు గలుగును? అవునవును. పరాకుపడితిని. అదిగో! రామహస్తము! రఘురామహస్తము! జానకీరామహస్తము ( అనిపరీక్షించి జూచుచు ) అదిగో! ఆయుంగరమే! ఆ కనిష్ఠాంగుళమున జాజ్జ్వల్యమానంబుగఁ దేజరిల్లుచున్న దాయుంగరమే! తొల్లి నేను సీతాన్వేషణార్థము లంకాపట్టణంబును జేరుతరి నాకా నీలమేఘశ్యాముఁడు తనపేరున సీతమ్మకు కానవాలుగా నొసంగిన దాముద్దుటుంగరమే! అశోకవనమున నున్న యాజానకి నాకొసఁగ గొనాప్ప చేతులనఁగఁ గంకణమాయునదా యంగుళీయకమే! లభదాంగుళి ముద్రయే. ఆ మెఱయుచున్నదా హస్తమే! ఆ విశ్వామిత్రమునీంద్రదత్తకోదండగుణమధ్యభాగవిన్యస్తముష్టిహస్తమే. అశుభప్రశస్తహస్తమే! ఔరా! సకలక్షోణీ తలాధినాథ దుర్నిరీక్షితమై, నిఖిల సురాసురాభేద్యమై, నిటలాక్షనిబిడనిస్తంద్రప్రభా కలితమై, నిరుపమానమై, నిర్వ్యాళమై, నిరూఢమై, నిరంకుశమై నెగడిన యానీల కంధరచాపమును నిమేషకాలమున నిర్జించిన దాహస్తమే! అహో! మున్ను మేము సకల వానరులమును గలిసి సముద్రమున సేతువుఁ గట్టుచుండ మాకుఁదగిన రీతిసాయమొనర్చిన యాచిన్ని ముద్దుటుడుతను జేఁబూని మూర్ధ్దాడి బుజ్జగించి దువ్వినదాయంగుళములే! ఇంకనందియు మేలు! నాడు నేను లంకాపురమును బరశురామప్రీతిఁ గావించితిరిగి గిష్కింధకుఁ బ్రవేశించి నిన్నుఁగని యాజానకీశుభవర్తమానమెల్ల నీకుఁ దెల్ప నీ వెంతయు నంతసించి " మారుతీ! మాకొఱకెంత ప్రయాస మొందితివి? నీవాలమగ్నిస్పర్శ చేఁ గాలికమునొచ్చి యున్నదికాఁబోలు" ననియంటి, వాత్సల్యమున మెల్లగా నిమిరిన దాహస్తమే! పరశురామ పరమపరిభావమను బుడికి పుచ్చుకొనిన దాహస్తమే! మగుడ నిన్నినాళ్లకు నాకంటఁబడినది! నేఁటికి నీదయావర్షమును నాపయిఁ గురిపించితివి. నన్ను ధన్యునిఁ గావించితివి! రామా! ఏమో పల్కుచుంటివి! ఒక్కగడియ [illegible] తెల్పుచుంటివా! [illegible] లేదను. నీమాటలయే నాకమృతధారలు, నీధ్యానమే నాకు - ముక్తి పుష్పములవాన. నీనీడయే నావిచారోష్ణమును బాధఁ దొలఁగఁజేయు. నీనా

మామే నా కనేకసుము. నీవే నాకుదిక్కు. అనుగ్రహింపుము. రక్షిం.

( అని మూర్ఛిల్లును )

( నారదుఁడు ప్రవేశించును. )

నార— పాపమీమారుతి యాబలరామ గరుత్మంతులతోఁ బోరుటంజేసి కడునలసినిద్రించుచున్నట్లుతోఁచుచున్నది! శ్రీరామదర్శన వాంఛఁజెందవు పెట్టడానఁబెట్టుకొని నావెంటనంటి యింతదవ్వరు దెంచిన యీభక్తాగ్రేసరునకు, నీబలవంతున కింతలో నింత యొడలెఱుఁగని నిద్రయా!

అంజ— ( చేతులు ముకిళించి) రామా! (అనిపలవరించును)

నార— ఆహా! యీమహానుభావునకు నిద్రలోఁ గూడ రామధ్యానమే! అదిగో లేచుచున్నట్లున్నది!

అంజ— లేచి. ఓహో! నారదా! మనమింక వెడలుదుమా?

నార— ఎచ్చటకు?

అంజ— శ్రీరామకృష్ణునిదరికి.

నార— ఈపురమునసున్న వాసుదేవుఁడే శ్రీరాముఁడని తెలిసికొంటిని. శీఘ్రముగరమ్ము. వానిపాదములపై వ్రాలవలయును.

నార— వాని యన్నను దండించితివి కాన నాతని దరికేగుటకు నీకు భయములేదా?

అంజ— భయభక్తులు రెండునుగలవు.

నార— నీవంటి వాని కెచ్చటనైనను భయమేల?

అంజ— మునీంద్రా! నీ కయ్యాఁపు వి త్తనము లనాదరిఁజల్లుటకుఁబూనకుము. కుహ్యాదయమట్టి వానికి జాతినేల యసినమ్మ ము. వచ్చెదవా? లేదా?

నార— (తనలో) ఈతనికిఁ గృష్ణుని సమాచారము తె
లిసినట్లున్నది. వీనికడ నాపాచిక పారదు.

అంజ— ఏమి?

నార— రా! రమ్ము. అందుకుసిద్ధముగనే యున్నాను.

అంజ— "వనమధ్యమున" అను పద్యమును జదువుచు

(నిష్క్రమించును)

నార— (వెంటఁజనును)

---

షష్ఠరంగము. అంతఃపురము.

సత్యభామ కూర్చుండును.

సత్య— అక్కటా! నేనెంత పొరపాటొనరించితిని! నామనోహరుఁడరుదెంచి లలితపరసగతుల నన్నెంతపల్కరించినను నేనాతని సరకుసేయక, కన్నుగానక గర్వించి యుంటిని! ఇప్పుడు విచారించిన నేమిలాభము గలదు? ఉచితకాలమునకు దితాలోచనము లేకుంట యేకదా మా స్త్రీజాతికిఁగలలోపము! కాలమతిక్రమించిన తరువాత నెంతబుద్ధి గలిగిననేమి? యెట్టియుక్తులలవడిననేమి? నానాథుఁడైనను మఱియొక్కక్షణమయినఁ దాళి నాయుద్దేశముఁదెలిసికొనఁడయ్యెను గదా! ఆరుక్మిణీమాయయే వానినట్లు చేయుచున్నది. ఆహా! అతఁడు దానిచేతి బొంగరమయ్యెనుగదా! దాని యిచ్ఛకములే వానినిబిచ్చి వానిఁగాఁజేయుచున్నవి! దానిమరలే వానినిమఱపించుచున్నవి!

(అంతట నారదుఁడు ప్రవేశించును)

సత్య— (లేచి) మునీంద్రా! నమస్కారములు. ఈపీఠమున దయసేయుము.

నార— సకలైశ్వర్య సిద్ధిరస్తు!

సత్య— దేవా! యెచ్చటనుండి వచ్చుచుంటివి!

నార— ఇచ్చటనే యుంటివిగదా! నీవెఱుఁగవా?

సత్య— ఆసంగతి నే నెఱుఁగను. అట్లయిన శ్రీకృష్ణుని సందర్శించియే యుందువు!

నార— సందర్శించుటయే కాదు. ఇంతవఱకు నా దేవుని చెంతనేయుండి వారి కొద్దిసెలవుఁ గైకొని పోవుటకు ముందుగ నిన్నుఁ గూడ నొకసారి చూచిపోవలెనని యెంచి యిచ్చటకు వచ్చితిని. తేఁకువయు గినుకంటివికదా!

సత్య— ఏదో! ప్రేమముగానేయుంటిని.

నార— నాఁటి పారిజాతము బాగుగ వృద్ధిఁజెంది ప్రీతినింపుచున్నదిగదా

సత్య— వృద్ధిగనేయున్నది. కాని నామనోహరుఁడు నాయెడఁబ్రీతిఁజూపుల మానసుఁడై యుండకట్టి పుష్పరాజముల సొబగులేల? యీ యంటిపురముల చందములేల? ఈనగల, యీనాణెముల, నలువురేల? ఈఁబ్రీతులేల?

నార— నీవట్లూహించి చింతవలదు. గోపాలునకు నీయందలి మక్కువ యెక్కువగనేయున్నది కాని యిసుమంతయును దగ్గలేదనిన మాత్రము.

సత్య— అది నీవెట్లెఱుంగుదువు?

నార— ఎఱుఁగుటయే కాదు, నీకది తెలుపుటకుఁగూడ నే నెంచితిని. నేను గోవిందుఁడు వాయుపుత్త్రుఁడగు నాంజనేయునికి శ్రీరామరూపమున దర్శనమొసఁగుటకు నిశ్చయించుకొని నిన్నుఁగూడ వచ్చుటకుఁ దోడ్కొనిరమ్మని నాతోఁ జెప్పెను.

సత్య— ( చిఱునగవుతో ) మంచివిశేషమే తెచ్చితివి!

నార— ఇంతేకాదు. మఱియొక చిన్న మాటకలదు. మాధవుఁడు రాఘవునిగతిఁ నిలుచు సమయమున రుక్మిణియుఁ జానకియై

వానిచెంత నిలుచునఁట. వింటివా! ఈరూపమునఁ నీవు ధరించు టమంచిదికాదు. నీవేల సీతవై యాచెంతనిలువఁగూడదు?

సత్య— ఆపెయాశకు మితియు మేరయుఁ గూడ లేనట్లు నాకుఁ గాన్పించుచున్నది! అది యెంతటక్కరి!

సీ. పెండ్లాడుటకు మున్నె ♦ వెన్నునికెన్నియో
జాబులనంపిన ♦ జాణ యిన్న!
అన్నయుద్దేశ ♦ మట్టులుంచి హరిని ద
గుల్కొ! వచ్చిన ♦ కులుకులాడి!
పారిజాతమునకై ♦ పంతంబుఁబూని క
య్యముఁ బెట్టినట్టి గ ♦ య్యాళిగంప!
చిబుకజాఁపంబుతో ♦ శ్రీకృష్ణుసరిఁజేయు
మంత్రంబు లెఱిఁగిన ♦ మాయలాడి!

గీ. మాటిమాటికి మురిపెముల్ ♦ బూటకములు
వేయుఁగలిగిన వగలవం ♦ కారు! నేఁడు
గూడఁ బెద్దరికంబొనఁ ♦ గూడ నచట
నెటులు సీతయై నిలుచునో! ♦ యేను జూతు!

నార— సెబాసు! దేవీ! మాటయనిన యిట్లుండవలయును. ఎట్టిపంతమయిన, నెట్టిమాటలయిన, నెట్టిముద్దుముచ్చటలయిన నీకే చెల్లినవి. నేఁడచ్చటనీవే జానకీ రూపమున నలరి యా యనిల తనూజ నమితానంద మానసునిగాఁజేయవలెనుగాని యన్యుల వశ మగునా! ఎవ్వరెట్టికార్యమునకుఁ దగుదురో వారేపూనవలయును గాని యితరులు సిద్ధపడిన హాస్యాస్పదులగుదురుకదా! దేవీ! శీఘ్రంబుగరమ్మా. నేను నడచుచుందును.

సత్య— దేవా! ఇంచుకతాళుము. శ్రీరాముని భార్య యగు జానకీ రూపము గొంతనాకుఁ దెల్పుఁడు. నేనారీతిగనే యలంకరించుకొని యథాస్థానంబున వేచుండెదను.

నార— ఆమాత్రి మెఱుఁగవా! ఆపెనీవలెనే చక్కనిచుక్కకాని యిట్టిచిత్రాంబర విచిత్రాభరణాదులఁ దాల్పనిచ్చగింపనిగోల. ముఖపద్మమునఁ బచ్చని పసుపువిరివిగాఁ బూసికొని లలాటభాగంబున మందారకుసుమమంతటి వలయాకారమగు బొట్టును బెట్టుకొని, నారచీరయే ధరించి, కురులదువ్వకయే వ్రేలాడవైచి యుందియలు రవళియిసుమంతయుఁగాకుండ మందమందగమనమున నలరు సుందరదవ! తెలిసినదా?

సత్య— అట్లుమారుటననెంత! మునినాథా! నీవరుగుచుండుము. నీవెనువెంట నే యాత్రాపునకు వచ్చి యెల్లఁవారును నన్నుఁగని సీతయేనిశ్చయముగ నేఁడవతరించిన దని చెప్పుకొనునట్లు చేసెదను.

నార— తరుణముమాత్రిము మించనీయకుము.

( అని నిష్క్రమించును )

సత్య— కానిమ్ము. రుక్మిణిగూడ నెట్లువచ్చునో చూచెద. అది రానేరదు. ఒకవేళవచ్చినను జానకీరూపసంపద లెఱుఁగనిదగుటచే సిగ్గుపడి మరలిపోవును! ఈదినముమంచిదే! నారదుఁడెప్పుడువచ్చినను నాకెద్దియో యుపకారమేచేయుచుండును. వీని మేలుమఱవను. ఇఁక నీవేషమును మార్చి వేగముగాఁ జనవలెను గదా!

( అని నిష్క్రమించును )

సప్తమరంగము.

శ్రీకృష్ణుని భవనము.

శ్రీకృష్ణుఁడు కూర్చుండును.

కృ— నాభక్తాగ్రేసరుఁడగు నాయాంజనేయుని మఱలనెన్ని దివసంబులకుఁ జూడఁగాంచుచుంటిని! రుక్మిణితోఁగూడ నీసంగతిఁ

దెలిపియుంటచే నాపెకూడ వానిఁ జూచుటకుఁ గుతూహలాయత్త చిత్తనై తప్పక రాఁగలదు. ఆగుణవంతుఁడు నా రామస్వరూపము నెప్పుడును దలంచుచునే యుండి యిప్పుడు మగుడ నేనా రూపముఁ దాల్చియుంటినని నమ్మి యాశీతాచలమునుండి యింతదవ్వురు దెంచి నాఁడు. భళిరా! యాతని భక్తి కుద్వితీయము! పీనిఋణము నే నెప్పుడెట్లు తీర్చికొందునో యెఱుఁగనైతి! ఈపుణ్యాత్మునకు నా రఘురామస్వరూపమును గన్నులఁజూచుటయే కోటిధనములుగాని యన్యమేమియు నక్కఱలేనివాఁడు. సరిలే! కానిమ్ము!

( రుక్మిణి ప్రవేశించును. )

కృ— ప్రేయసీ! వచ్చితివా!

తెరలోఁ 'కొల్చినాఁడఁ గొల్చుచునుంటి'

యను పద్యము నాంజనేయుఁడు చదువును.

కృ— ఆ కంఠనినాదమా వనచరవీరునిదే! పల యింతదైన్యముగావినఁ బడుచున్నది! పాపము! గొంతుకసవ్వడికూడ మారినదే!

( అంత నాంజనేయనారదులు ప్రవేశింతురు )

ఆంజ— ( ఆశ్చర్యముతోఁ గృష్ణునిఁ గాంచి ) శ్రీరామకృష్ణా! నాయపరాధమును మన్నింపుము. నీవునీవని యెఱుఁగకయు, నీసోదరుఁడని యాబలరాముఁ దెలిసికొననేరకయు, నూరక పొరపాటొనరించితిని. క్షమియింపుము. నీచరణదాసుఁడను! నీదాసుఁడగు సుగ్రీవుని దాసుండను. పాపాత్ముఁడను. కరుణింపుము. కావుము. నీవు రాముఁడవగు కృష్ణుఁడవని యింతకుమున్నెఱుఁగనైతిని.

( సీతవేషమున సత్యభామ ప్రవేశించి కృష్ణునిప్రక్కనిలుచును )

( రుక్మిణీ కృష్ణులు సీతారాములుగా మారుదురు )

ఆంజ — హా! రఘురామా! నాజన్మమిన్నినాళులకు సఫలఁ

పావనమధుమపతి. నీచరణంబులు మరుగ నేఁడలభదిపవి.

( అని పాదములపైఁబడి )

ఆ॥ వె॥ పీఫలంబున కయి ♦ యిన్నినాళ్లింతయు
శీత శైలమందుఁ ♦ జేరి, భక్తి
సన్నుతించు చుంటి ♦ నంతరంబును నట్టి
ఫలమునహహా! నేఁడు ♦ పడసినాఁడ!

కృ— మారుతీ! లెమ్ము! ( అనిలేవదీయును. )

ఆంజ— దేవా! ఇదియేమి? నీ వేశపత్ని వ్రితుండవు గావా ఈ కామినియెవ్వ లె? యిచ్చట కీరీతి రాఁదగినది. హా! జానకీ!! నీదరినెప్పుడును నిట్టి పరిచారికను గాంచియుండ లేదే!

( సత్యభామ కృష్ణునికిఁ జేరువగాఁ జనును )

సత్య— ఆంజనేయా! నేనేజానకి నని యెఱుఁగవా!

ఆంజ— ఛీ! దూరముగాఁ బొమ్ము. అట్లనుటకీకును, విను వారికిని, గను వారికిని గూడ మహాపాపముసంభవించును. నీవెవ్వ తెవయినను జనకాత్మజవగు సీతవుమాత్రముగావు. ఆదేవీపరిచారి కవు గూడఁగా నేరవు. ఆకాలఁ(?)గొంతవేశావు. కవలుము. ఇ ట్టులనీకువిలుబవఁదగదు. అదిగో! యాదివ్యసుందరమూర్తికి వామ భాగమ్మునవిలుపఁబడిన పరమసాధ్వీమతల్లిక యే సీతమ్మ! అమహాలక్ష్మి యే సీతమ్మ! నీవు దూరముగాఁ బొమ్ము.

సత్య— ( దూరముగాపచ్చినిలుచును. )

( శ్రీరామకృష్ణదేవా! నేను ధన్యుఁడనైతిని )

సీ. ఆనీలమేఘంబు ♦ నీనీలమేఘంబు
నొకటియే! రెంకటిరేమీ! ♦ రెుకటు! దేవ!
ఆవానరాశ్రితిమ్మంచు ♦ నీచానరాశ్రితిమ్మంచు
నొకటియే! యొకటియో! ♦ యొకటు! దేవ!

ఆశార్ఙ్గటంకార ♦ మీఘోశంఖహుంకార
మొకటియే! యొకటియే ♦ యొకటె! దేవ!
ఆచాపఘనధార ♦ లీచక్రఘనధార
లొకటియే! యొకటియే! ♦ యొకటె! దేవ!

గీ. నందియుంబేలు! శ్రీరామ ♦ చంద్రుఁడవును
వాసుదేవుఁడవును నీవ ♦ వాస్తవంబు
నీదయా వృష్టినింక నా ♦ మీఁదఁబఱప
రమ్ము! తీర్పుమునాతృష్ణ ♦ రామకృష్ణ!

కృ—పావనీ! నేను రామావతారమున నేకపత్నీవ్రతుఁడను! ఈయవతారమున ననేకకాంతాలోలుఁడనై మెల్గుచుంటిని. ఆపెవా భార్యలలో నొకరిత యగుసత్యభామ! ఆమెకు మనమునఁ గల గర్వలేశముచే నప్పుడప్పు డిట్టివిసంభవించుచుండును

సత్య— దేవా! క్షమింపుఁడు.

కృ— ప్రియసీ! గర్వంబుండుట యెరికయినఁదగునా?

నార— తగదు: తగదు. మహాత్ములకి దగదు.

కృ— అవును. ఆంజనేయా! నీకోర్కెనెరవేరినదికదా! నీవుసామాన్యుండవుకావు. సకలశాస్త్ర విజ్ఞానుండవు! భవిష్యద్బ్రహ్మవు. చిరంజీవివి! నిష్కళంకుఁడవు. నీయథాస్థానంబున కరిగి తుదకుబ్రహ్మపదవి నొందుము. నేనెల్లపుడు నీమానసముననుండునని యే నమ్ముము.

ఆంజ— మహాప్రసాదము.

కృ— హితులారా!

గీ. కోటి ధనములు గూడినఁ ♦ గూడుఁగాక
అధిక భుజ బలమబ్బిన ♦ నబ్బుఁగాక!
చండతరకీర్తి యెంతయు ♦ నంగుఁగాక!
గర్వ మిసుమంతయైనను ♦ గనుట తప్పు

( తెర పడును. )

సమాప్తము.



శ్రీరామానుజ. విలాస ముద్రాక్షరశాల, విజయనగరం.